శ్రీః

శ్రీవాదిరాజతీర్థవిరచితా

# దశావతారస్తుతిః

ఆంధ్రటీక - డా॥ సూరం శ్రీనివాసులు



ప్రకాశకులు

**రావి మోహనరావు,** M.Sc., M.A. (Sanskrit)

404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523155.

శ్రీః

శ్రీవాదిరాజతీర్థవిరచితా

# దశావతారస్తుతిః

ఆంధ్రటీక - డా॥ సూరం శ్రీనివాసులు

ముద్రణ : *15-08-2019 - శ్రీ అరవింద జయంతి*

ప్రతులు : *500*

పేజీలు : *76*

వెల రూ. : *40-00*


Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411

*D.T.P. by :-*
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

*Printed at -*
**Karshak Art Printers,**
**HYDERABAD**



శ్రీ వాదిరాజు తన దిగ్విజయయాత్రలో భాగంగా పండరపురానికి వెళ్ళినపుడు జరిగిన సంఘటనకు సంబంధించినదిగా ఈ దశావతారస్తుతిని భావిస్తారు. వైష్ణవార్చనావిధానంలో దశావతారస్తుతి కూడా ఒక భాగంగా వుంటుంది.

పండరపురానికి శ్రీ వాదిరాజు వేంచేసినపుడు హయగ్రీవస్వామి ఒక తెల్లగుర్రంగా మారి ఆ వూరి రైతు చేలోని సెనగపంటను తిన్నాడట. ఆ రైతు ఆ గుర్రం వెంటబడగా అది శ్రీ వాదిరాజు సన్నిధిలో మాయమయిందట. నష్టపరిహారం కోరిన రైతుకు శ్రీ వాదిరాజు అభయమిచ్చి పంపాడట. మరునాడు ఆ రైతు పొలంలో గుర్రం తిన్నంత మేర బంగారు సెనగలు కనిపించాయట. ఆ రైతు శ్రీ వాదిరాజు ఘనతను గ్రహించి, తన సంపదనంతా వారి కర్పించి శిష్యుడైనాడట.

దీనిద్వారా శ్రీ హయగ్రీవుని ఆంతర్యాన్ని గ్రహించిన వాదిరాజు సెనగలతో ప్రత్యేకమైన తీపిని చేయించి, దానిని తలపై పెట్టుకొని హయగ్రీవునకు నివేదిస్తూ అశ్వధాటి వృత్తంలో దశావతారాలను స్తుతించాడట. అప్పుడా తెల్లగుర్రం కదంత్రొక్కుతూ ఆ స్తోత్రాని కనుగుణంగా నర్తించి వాదిరాజు భుజాలపై తన ముందుకాళ్ళను మోపి, వాదిరాజు తలపైనున్న ఆ ప్రసాదాన్ని ఆరగించిందట.



శ్రీః

శ్రీవాదిరాజతీర్థవిరచితా

# దశావతారస్తుతిః

శ్లో॥ ప్రోష్ఠీశవిగ్రహా! సునిష్ఠీవనోద్ధతవిశిష్టాంబుచారిజలధే!
కోష్ఠాన్తరాహితవిచేష్టాగమౌఘ! పరమేష్ఠీడిత! త్వమవ మామ్ ।
ప్రేష్ఠార్కసూనుమనుచేష్టార్థమాత్మవిదతీష్టో యుగాన్తసమయే
స్థేష్ఠాత్మశృఙ్గధృతకాష్ఠామ్బువాహన! వరాష్టాపదప్రభతనో! ॥ 1

**ప్రతిపదార్థము :** ప్రోష్ఠి + ఈశ = మేటి చేపయొక్క, విగ్రహా! = శరీరం వంటి శరీరం గలవాడా! (ఇక్కడ ఈశ శబ్దం శ్రేష్ఠతకు వాచకం), సునిష్ఠీ.... జలధే – సు నిష్ఠీవన = బాగుగా ఉమియుటచేత (నోటినుండి మొప్పలద్వారా బయటకు నెట్టుటచేత), ఉత్ + హత = పైకి కొట్టబడిన, విశిష్ట = గొప్పవయిన, అంబుచారి = జలజంతువులుగల, జలధే! = సముద్రం గలవాడా!, కోష్ఠా.... మౌఘ – కోష్ఠ = లోకడుపులోన, అంతర = లోపల, ఆహిత = ఉంచబడిన, విచేష్ట = చేష్టలుడిగిన, ఆగమ + ఓఘ = వేదరాశి గలవాడా!, పరమేష్ఠీడిత – పరమేష్ఠి = బ్రహ్మచే, ఈడిత! = స్తుతింపబడినవాడా! (ఈడ స్తుతౌ ధాతువుమీద కర్మార్థకమైన క్త ప్రత్యయం), యుగా.... సమయే – యుగ = యుగం యొక్క, అంత = ముగిసెడి, సమయే = వేళలో, ప్రేష్ఠా.... చేష్టార్థమ్ – ప్రేష్ఠ = మిక్కిలి ఇష్టుడైన (ప్రియ + ఇష్ఠన్ – తద్ధితప్రత్యయం – ప్రియకు ప్ర ఆదేశం), అర్కసూను–మను = సూర్యకుమారుడైన మనువు – వైవస్వతమనువుయొక్క, చేష్టా + అర్థమ్ = పూనిక కొరకు, స్థేష్ఠాం.... వాహన – స్థేష్ఠ = మిక్కిలి స్థిరమైన (స్థిర + ఇష్ఠన్ – తద్ధితప్రత్యయం – స్థిరకు స్థాదేశం), ఆత్మ = తనయొక్క, శృంగ = కొమ్ముతో, ధృత = ధరించిన / పూనిన, కాష్ఠ = కొయ్యతో చేసిన, అంబువాహన! = పడవగలవాడా!, వరా.... తనో – వర = శ్రేష్ఠమయిన / మేలిమి అయిన, అష్టాపద = బంగారంవంటి, ప్రభ = కాంతిగల, తనో! = శరీరం గలవాడా!, ఆత్మ.... తీష్టః (సన్) – ఆత్మవిత్ = బ్రహ్మవేత్తలకు, అతి + ఇష్టః సన్ = మిక్కిలి ప్రియమైన వాడవై, త్వమ్ = నీవు, మామ్ = నన్ను, అవ = కాపాడుము. (రక్షణాద్యర్థమయిన అవ ధాతువుమీద లోట్ మధ్యమపురుషైకవచనం)

**తాత్పర్యము :** మేలిమి బంగారువన్నెతో మెరిసే శరీరం గలవాడా! మత్స్యస్వరూపా! బ్రహ్మవేత్తలకు నీవు ప్రియతముడవు. నీ నిష్ఠీవనంతో సముద్రంలోని పెద్దపెద్ద జలచరాలు కూడా పైకి ఎగరగొట్టబడతాయి. నీవు నీ లోకడుపులో వేదాలను దాచి నిలిపావు. చాక్షుషమన్వంతర యుగాంతవేళలో నీవు మెచ్చిన వైవస్వతమనువు మరల సృష్టిని ఉజ్జీవింపజేయటానికి అనువుగా నీ కొమ్ముతో కొయ్యపడవను లాగుతూ వైవస్వత మనువును నిలిపావు. వేదాల రక్షణ చేసి పరమేష్ఠి ప్రస్తుతుల నందుకొన్నావు. నన్ను నీవు కాపాడు.

**విశేషాలు :** అగ్నిపురాణంలోని రెండవ అధ్యాయం, శ్రీమద్భాగవతంలోని ఎనిమిదవ అధ్యాయం, శ్రీమహాభారతంలోని వనపర్వంలోని 187 అధ్యాయం మత్స్యావతార కథను వివరిస్తున్నాయి. చేపపిల్లగా వైవస్వతమనువు చేతికి చిక్కి పెరిగి పెరిగి ప్రళయవేళలో వైవస్వతమనువునే తరింపజేసి సృష్టి కొనసాగింపునకు దారిచూపిన కథను ముచ్చటగా చెప్తున్నాయి.

'చాక్షుష మన్వంతర సంప్లవంబున దశమంబయిన మీనావతారంబు నొంది మహీరూపంబగు నావ నెక్కించి వైవస్వతమనువు నుద్ధరించె' (పోతన భాగవతం 1-63) నని ప్రస్తావనలో చెప్పి ఆపై అష్టమస్కంధంలో మత్స్యావతారకథను విస్తరించాడు పోతన. హయగ్రీవుడు వేదాలను అపహరించినట్లు భాగవతం ప్రస్తావించగా మధుకైటభులు వేదాల నపహరించినట్లు దేవీభాగవతంలోని దశమస్కంధం చెపుతోంది.

అసలీ మత్స్యకథ శతపథబ్రాహ్మణంలో ప్రథమకాండం - అష్టమాధ్యాయం - షష్ఠ ప్రపాఠకంలో కనిపిస్తోంది -

మనవేహవై ప్రాతః అవనేజ్యముదకమాజహుర్యథేదం పాణిభ్యామవనే జనాయాహరంత్యేవ తస్యావనేనిజానస్య మత్స్యః పాణీ ఆపేదే సహాస్మై వాచమువాచ. బిభృహి మా పారయిష్యామి త్వేతి కస్మాన్మా పారయిష్యసీత్యౌఘ ఇమాః సర్వాః ప్రజా నిర్వోఢా తతస్త్వాం పారయితాస్మీతి కథం తే భృతిరితి. సహోవాచ. యావద్వైక్షుల్లకా భవామో బహ్వీవైన స్తావన్నాష్ట్రా భవత్యుత. మత్స్య ఏవ మత్స్యం గిలతి కుంభ్యాం మయి బిభరాసి. స యదా తా మతివర్ధా. అథ కర్షూ స్నాత్వా తస్యాం మా బిభరాసి. స యదా మా మతివర్ధా అథ మా సముద్రమభ్యవహరాసి త హి వాతినాష్ట్రో భవితాస్మీతి శశ్వద్ధ ఝష ఆస సహి జ్యేష్ఠం వర్ధతే. అథ తిథిం స మాం తదౌఘ ఆగంతా తన్మా నావముపకల్ప్యోపాసాసే స ఓఘ ఉత్థితే నావమపాద్యాసౌ తతస్త్వా పారయితాస్మి"

భగదవతారాల ప్రయోజనం సామాన్యంగా సాధుసంరక్షణం. మత్స్యావతారంలో వేదసంరక్షణం ఒక ప్రయోజనం. మరొక ప్రధానప్రయోజనం చరాచరజగద్బీజరక్షణం. మత్స్యపురాణం ఆ విషయాన్ని ఇలా వివరించింది -

భూతగ్రామస్య సర్వస్య స్థావరస్య చరస్య చ ।
భవేయం రక్షణాయాలం ప్రలయే సముపస్థితే ॥ - మత్స్యపురాణం 1.15

అని వైవస్వతమనువు బ్రహ్మను కోరినట్లు **వక్కణ.** ప్రళయకాలంలో చరాచరభూతసంరక్షణ చేయగలశక్తి తనకు సిద్ధించాలని వైవస్వతమనువు బ్రహ్మను కోరాడు. తత్ఫలమే మత్స్యావతారం.

విషునకాలంలో బంగారుచేప బొమ్మతో పాటు మత్స్యపురాణగ్రంథాన్ని దానం చేస్తే ఉత్తమఫలితాలు సిద్ధిస్తాయని అగ్నిపురాణం చెప్తోంది.

త్రయోదశసహస్రాణి మాత్స్యం కల్పాదితోఽబ్రవీత్ ।
మాత్స్యే హి మనసే దద్యాతే విషువే హేమమత్స్యవత్ ॥

ఇతిహాసపురాణానాం పుస్తకాని ప్రయచ్ఛతి ।
పూజయిత్వాయురారోగ్యం స్వర్గమోక్షమవాప్నుయాత్ ॥

– అగ్నిపురాణం 2-27-22, 26

**అష్టాపదమ్ :** అష్టసు (లోహేషు) పదం (ప్రతిష్ఠా) అస్య ఇతి అష్టాపదమ్. అంటే బంగారం. ఎనిమిది లోహాలలో విశిష్టమైనది కాబట్టి బంగారం అష్టాపదమైంది. బంగారం, వెండి, ఇనుము, కంచు, ఇత్తడి, తగరం, సత్తు, పాదరసం – ఇవి 8 లోహాలు.

**గీతగోవిందం :** జయదేవుడు గీతగోవిందంలో దశావతారస్తుతిరూపంగా ఒక గీతాన్ని రచించాడు.

ప్రళయపయోధిజలే – ధృతవానసి వేదం విహితవహిత్రచరిత్రమఖేదం – కేశవ! ధృతమీనశరీర – జయ జగదీశ హరే!

**అశ్వధాటి :** ఇది 22వ ఛందస్సునకు సంబంధించిన వృత్తం. కాబట్టి సంస్కృతవృత్తం. త భ య జ స ర న గ గణాలు. 7, 14 అక్షరాలు యతిస్థానం. ఇంతవరకు సంస్కృత ఛందోలక్షణం. ఆపై తెలుగు లక్షణాలు కూడా దీనిలో కలుస్తున్నాయి. యతిని సంస్కృతంలో వలె విచ్ఛేదమాత్రం కాక తెలుగులో లాగా యతిమైత్రిని, తత్రాపి ప్రాసయతిని ఆదరించటం, నాలుగు పాదాలలోనూ ప్రాస నియమాన్ని పాటించటం పద్యానికి సొగసును కల్పించి, శైలిని కదం త్రొక్కిస్తుంది.

హయగ్రీవస్తుతిపరమైన అశ్వధాటి ఇది.



**శ్లో॥ ఖండీభవద్బహులడిండీరజృంభణసుచండీకృతోదధిమహా–**
**కాండాతిచిత్రగతిశౌండాద్య! హైమరదభాండాప్రమేయచరిత! ।**
**చండాశ్వకంఠమదశుండాలదుర్హృదయగండాభిఖండాకరదో–**
**శ్చండామరేశ! హయతుండాకృతే! దృశమఖండామలం ప్రదిశ మే ॥ 2**

**ప్రతిపదార్థము :** ఖండీభవత్.........శౌండ : ఖండీభవత్ = బ్రద్దలగుచున్న, బహుల = మిక్కుటమైన, డిండీర = నురుగుయొక్క (డిండీరోఽబ్ధి కఫః ఫేనః అమరకోశం 2-105), జృంభణ = చెలరేగుటచే, సు-చండీకృత = మరీ కోపముగలవాడుగా చేయబడిన, ఉదధి = సముద్రమండలి, మహా = అతిశయించిన, కాండ = నీటియందు (కాండోఽస్త్రీ దండబాణార్వవర్గావసరవారిషు. అమరకోశం 3-44), అతి-చిత్ర = పరమాశ్చర్యకరము లయిన, గతి = గమనముల (ప్రదర్శించుట)తో, శౌండ! = ఒళ్ళు తెలియనివాడా! (మత్తే శౌండోత్కటక్షీబాః. అమరకోశం 3-24), ఆద్య! = మొదటివాడా! (విశ్వానికి మూలభూత మయినవాడు), హైమ......భాండ : హైమ = స్వర్ణమయమయిన, రద = దంతములు, భాండ = ఆభరణాలుగా (కళ్ళెం మొ॥) కలవాడా! (స్యాద్భాండమశ్వాభరణేఽమత్రే మూలవణిగ్ధనే. అమరకోశం 3-45), అప్రమేయ-చరిత! = కొలతకు (ప్రమాణములకు) అందని నడత గలవాడా!, చండా.... చండ : చండ = భయంకరమైన, అశ్వ-కంఠ = హయగ్రీవుడను పేరుగల, మద = మదించిన, శుండాల = ఏనుగుయొక్క, దుర్హృదయ = దుష్టహృదయమనెడి,

గండ = కుంభస్థలమును, అభిఖండా(?)కర = బ్రద్దలు చేసెడి, దోః = భుజములతో, చండ! = ప్రమాదకరమైన వాడా!, అమర+ఈశ = దేవతాపాలకుడా!, హయ-తుండ+ఆకృతే = హయవదనస్వరూపా! (వక్త్రాస్యే వదనం తుండమాననం లపనం ముఖం. అమరకోశం 2-89), మే = నాకు, అఖండ + అమలమ్ = పరిపూర్ణమూ, నిర్మలమూ అగునట్లుగా, దృశమ్ = జ్ఞానమును, ప్రదిశ = ఒసంగుము.

**తాత్పర్యము :** హయగ్రీవా! చిద్రుపలై చెలరేగుతున్న నురగలతో భయంకరంగా వున్న సముద్రంలోని అనంత జలరాశిలో చిత్రగతులను ప్రదర్శించటంలో నీవు నేర్పరివి. నీవే సృష్టికి మూలం. స్వర్ణమయ దంతాలూ, తొడవులు గలవాడవు. ప్రమాణాల కందని నడవడి గలవాడవు, హయగ్రీవాసురుడనే మదపుటేనుగుయొక్క చెడ్డ గుండెలనే కుంభస్థలాన్ని బ్రద్దలుచేసినవాడవు. అమరులకే నీవు ఏలికవు. అటువంటి నీవు నాకు అమలమూ, అఖండమూ అయిన జ్ఞానాన్ని ప్రసాదించు.

**విశేషాలు :** ఈ శ్లోకంలోని మూడవపాదం చివరలో "గండాభిఖండాకర" అని పాఠముంది. దాదాపు అన్ని ప్రతులలో అలాగే కనిపిస్తోంది. అది అనూచానంగా వచ్చి వుండవచ్చు. కానీ దానితో గణభంగం ఏర్పడుతోంది. అర్థంకూడా అస్పష్టం. ఖండన కర అన్నది అసలు పాఠమై వుండవచ్చు. అప్పుడు అర్థ స్పష్టత, గణస్వచ్ఛత కలుగుతుంది.

**దృక్** శబ్దం జ్ఞానార్థంలో ప్రయోగించబడింది. ఈ పదాన్నే కర్త్రర్థంలోనూ, కరణార్థంలోనూ కూడా ప్రయోగించవచ్చు. దర్శనం దృక్ జ్ఞానం, పశ్యతి ఇతి దృక్ (జ్ఞాత). దృశ్యతే అనయా ఇతి దృక్ (దర్శన కరణం)-

**ప్ర** ఉపసర్గ పూర్వకమయిన దిశ అతిసర్జనే ధాతువు మీద లోట్ మధ్యమపురుషైక వచనం ప్రదిశ. ఇది ఉభయపదిధాతువు. ప్రకృత ప్రయోగం పరస్మైపదంగా

అసలే అశ్వధాటీవృత్తం. బిందుపూర్వక డకారప్రాస దానికి మరీ అందాన్ని తెచ్చింది. అందునా డిండీర పదానికి అనుగుణంగా ఖండీభవత్ - చండీకృత అని చ్విః ప్రత్యయరూపాలను వాడటం, మిగిలిన మూడు పాదాలలోను బిందుపూర్వ 'డా' ను అంతటా - శుండాల తప్ప - సవర్ణదీర్ఘంతో నడిపించటం పద్యసౌందర్యాన్ని పెంచాయి.

అశ్వకంఠ - మదశుండాల; హృదయగండ ఈ రెండు రూపకాలు పరస్పర పరిపూరకాలు. లేశమాత్రంగా రూపకాన్ని వాడి "నాతి నిర్వహణైషితా" అన్న ఆనందవర్ధనుని అలంకార నివేశన సమీక్షను స్మరింపచేస్తున్నాడు కవి. అలంకారాలను రసతత్పరంగానే వాడాలంటూ ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో చేసిన సూచన అలంకార నివేశన సమీక్ష.

హయగ్రీవప్రసక్తి శ్రీమద్భాగవతంలో ఇలా వుంది.

హయశీర్ష్ణే నమస్తుభ్యం మధుకైటభమృత్యవే ॥ - 10.40.17

మధుకైటభులను సంహరించిన హయగ్రీవునకు నమస్కారమని అర్థం. సోమకుడు వేదాలను

అపహరిస్తే విష్ణుమూర్తి మత్స్యరూపంతో వేదసంరక్షణ చేసినట్లు ఒక గాథ. మధుకైటభులు వేదాల నపహరింపగా విష్ణుమూర్తి హయగ్రీవుడై వేదసంరక్షణ చేసినట్లు మరొక గాథ.

దేవీ భాగవతకథ ననుసరించి హయగ్రీవావతార లక్ష్యం హయగ్రీవుడనే రాక్షసుని సంహరించటం. హయగ్రీవాసురుడు దేవిని ప్రార్థించి తనకు మృతి కలుగకుండా వరమిమ్మని కోరాడు. అది కుదరనిదని ఆమె చెప్పగా హయగ్రీవుని చేతిలోనే తాను మరణించాలని కోరాడు. ఆమె అలాగే అన్నది. ఆ రీతిగా హయగ్రీవుని చంపటానికి శ్రీహరి హయగ్రీవుడు కావలసి వచ్చింది.

బ్రహ్మాదిదేవతల పొరపాటు వలన నిద్రలో నున్న విష్ణుమూర్తి తలతెగింది. అప్పుడు దేవతలు శక్తిని ప్రార్థింపగా ఆమె తాను హయగ్రీవాసురునకిచ్చిన వరానికి అనుగుణంగా విష్ణుమూర్తికి గుఱ్ఱపు తలను అతికింపమని సలహా ఇచ్చింది. ఆ మేరకు విష్ణుమూర్తి హయగ్రీవుడైనట్లు దేవీ భాగవతం చెప్తోంది.

వైదిక వాఙ్మయం ప్రకారం హయగ్రీవుడు యజ్ఞుని అవతారం. యజ్ఞుని విష్ణుమూర్తియొక్క పూర్వరూపునిగా తైత్తిరీయారణ్యం చెప్తోంది. పంచవింశబ్రాహ్మణం, తైత్తిరీయసంహితారణ్యకాలు కూడా అగ్ని, ఇంద్రుడు, వాయువు, యజ్ఞుడు ఈ నలుగురి హవిర్భాగాల విషయమై ఏర్పడిన ఘర్షణ కారణంగా యజ్ఞుని తలతెగటం, అక్కడ హయవదనాన్ని అమర్చటాన్ని గూర్చి వివరిస్తున్నాయి. బ్రహ్మ విష్ణువుకిచ్చిన శాపం కారణంగా విష్ణుమూర్తి హయగ్రీవుడు కావలసినట్లు స్కాందపురాణం, విష్ణువే లక్ష్మికిచ్చిన శాపం కారణంగా తాను హయగ్రీవుడు కావలసివచ్చినట్లు దేవీభాగవతం చెప్తున్నాయి. ఇలా హయగ్రీవావతారానికి సంబంధించి వివిధ కథలు వైదిక పౌరాణిక సాహిత్యాలలో కన్పిస్తున్నాయి.

**శ్రావణ పూర్ణిమను** శ్రీహయగ్రీవావతారదినంగా పరిగణించి ఆనాడు ఆయా దేవాలయాలలో విశిష్టపూజలు చేస్తారు.

**జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥**

అని హయగ్రీవుని జ్ఞానానందస్వరూపునిగా విద్యాదాతగా భావించి ఆరాధించటం అనూచానంగా వుంది.

శ్రీవాదిరాజతీర్థరు హయగ్రీవుని నిత్యమూ ఇలా స్తుతించేవారట –

న హయగ్రీవాత్పరమస్తి మంగలం – న హయగ్రీవాత్పరమస్తి పావనమ్ ।
న హయగ్రీవాత్పరమస్తి దైవతం – న హయగ్రీవం ప్రణిపత్య సీదతి ॥



**శ్లో॥ కూర్మాకృతే! త్వవతు నర్మాత్మపృష్ఠధృతభర్మాత్మమందరగిరే!**
**ధర్మావలంబనసుధర్మాసదాకలితశర్మా సుధావితరణాత్ ।**
**దుర్మానరాహుముఖదుర్మాయిదానవసుమర్మాభిభేదనపటో!**
**ఘర్మార్కకాంతివరవర్మా భవాన్ భువననిర్మాణధూతవికృతిః॥** 3

**అవతారిక :** దేవదానవులు అమృతం కోసం సముద్రాన్ని చిలికినపుడు కవ్వంగా వున్న మందరపర్వతం క్రుంగిపోతుంటే దాన్ని నిలపడానికి విష్ణువు స్వీకరించిన అవతారం కూర్మం. **కూర్మాన్ని (తాబేలుని) స్తుతించే శ్లోకమిది.**

**ప్రతిపదార్థము :** నర్మాత్మ... గిరే : నర్మ = క్రీడామాత్రంగా, ఆత్మ = తనయొక్క, పృష్ఠ = వీపుపై, ధృత = ధరింపబడిన (ధృఞ్ – ధారణే ధాతువుపై క్త ప్రత్యయం), భర్మ + ఆత్మ = స్వర్ణరూపుడైన, మందర = మందరమను పేరుగల, గిరే! = పర్వతము గలవాడా!; దుర్మాన... పటో! : దుర్మాన = దురభిమానముగల, రాహు–ముఖ = రాహువు మొదలయిన, దుర్మాయి = చెడు మాయలు గల / గారడీవాళ్ళయిన, దానవ = రాక్షసులయొక్క, సుమర్మ = మంచి ఆయువుపట్టులను, అభిభేదన = బ్రద్దలు చేయుటలో, పటో = సామర్థ్యం గలవాడా!, కూర్మ + ఆకృతే = కూర్మస్వరూపా!; సుధావితరణాత్ : సుధా = అమృతంయొక్క, వితరణాత్ = పంచిపెట్టుటవలన; ధర్మా....శర్మా : ధర్మ = ధర్మమే, అవలంబన = ఆశ్రయమైన / ఆధారముగాగల, సుధర్మా – సత్ = దేవతలకు (స్యాత్సుధర్మా దేవసభా – అమరకోశం 1/48. సుధర్మలో నుండువారు సుధర్మాసదులు – అస–భువి ధాతువుపై శతృప్రత్యయం చేరి 'సత్' రూపం సిద్ధింపజేస్తుంది), ఆకలిత = సమకూర్చబడిన, శర్మా = సంతోషము గలవాడవు (ముత్ప్రీతిః ప్రమదో హర్షప్రమోదానందసంమదాః । స్యాదానంద థురానంద శర్మ శాతసుఖాని చ ॥ అమరకోశం 1/26); ఘర్మార్క... వర్మా: ఘర్మ = (వేడిమిచే) చెమట పుట్టించు (జహర్తి ఇతి ఘర్మః– ఘృధాతువుపై మఞ్ ప్రత్యయము) అర్క = సూర్యునియొక్క, కాంతి = వెలుగే / వెలుగువంటి, వర = శ్రేష్ఠమైన, వర్మా = కవచము(గా) గలవాడవు (వృవరణే ధాతువుపై మనిన్ ప్రత్యయం); భువన...వికృతిః : భువన = లోకములయొక్క, నిర్మాణ = సృష్టించుటతో, ధూత = తర్కింపబడిన (చర్చింపబడిన) వికృతిః = వికారముగలవాడవు (అయిన), భవాన్ = నీవు, అవతు తు = కాపాడుదువు గాత (అవ రక్షణే – ధాతువుపై లోట్ ప్రథమపురుషైకవచనం).

**తాత్పర్యము :** క్రీడామాత్రంగా నీ వీపుపై బంగారుకొండను ధరించినవాడవు. దురభిమానులు, మాయలమారులు అయిన రాహువు మొదలయిన దానవుల ఆయువుపట్టులను భేదించుటలో సమర్థుడవు. దేవతలు, ధర్మాశ్రయులు అందుకే వారి సభ కూడా సుధర్మ, సుధర్మాసదులయిన వారికి కూర్మావతారంలో సూర్యకాంతి వంటి కవచాన్ని ధరించినవాడవు. విశ్వసృష్టి ద్వారా నీ పరిణామాన్ని తర్కానికి గురిచేసిన వాడవు అటువంటి వాడవు ప్రకృతంలో కూర్మరూపంలో వున్నావు. అందరినీ కాపాడు.

**విశేషాలు : కూర్మాకృతే 'తు'** – ఇక్కడ తు శబ్దం పాదపూర్ణమాత్రమే. 'తు హిచ స్మ వై పాదపూరణే (అమరకోశం 3/5) అన్న వివరణ మేరకు పాదపూరణ మాత్రమే అయినా అది వాక్యాలంకారమవుతుంది కాని దోషం కాదు.

– **శర్మన్** శబ్దానికి అర్థం సంతోషమని కాని దాని వ్యుత్పత్తి శృా–హింసాయామ్ అను ధాతువునుండి. హింసార్థమైన ధాతువు నుండి ఆనందార్థకమయిన పదాన్ని వ్యుత్పాదించటం విశేషం. దుఃఖాన్ని హింసిస్తుంది కాబట్టి సుఖాన్ని ఆ రీతిగా వ్యుత్పన్నం చేశారేమో!

– పరమాత్మ సృష్టి అయిన విశ్వాన్ని మాయగా భావిస్తాం. అయితే ఇంద్రజాలికుడు చేసే

ఇంద్రజాలంలో (కనుకట్టులో) మాయ విశ్వంగా కనిపిస్తుంది. అందుకే **మాతి అస్యాం విశ్వమ్ ఇతి మాయా** అని దాని వ్యుత్పత్తి. లేదా **మయస్య ఇయం మాయా.** మయసంబద్ధమైనది మాయ. ఆ మయమాయ మహాభారతంలో మయసభగా రూపొందింది. దాని ఫలితం జగమెరిగినదే. ధర్మసంరక్షణాత్మకమయిన జగద్వినాశమది. అందుకే ఏ మాయలోనూ పడకూడదు మానవుడు.

– నర్మపదం ప్రధానంగా వాగ్రూపమైన అర్థాన్నిస్తుంది. పరిహాసవచనం నర్మ. **'ద్రవకేళీపరిహాసాః క్రీడా లీలా చ నర్మ చ'** (అమరకోశం 1/32) ఆలంకారికులు **'పరిహాసవచో నర్మ'** అని వాగ్రూపంగానే దానిని నిర్వచించారు. అయితే క్రీడారూపంగా దానిని చేష్టారూపంగా కూడా స్వీకరించవచ్చు. కష్టసాధ్యమయిన పనిని కూడా క్రీడామాత్రంగా సులభంగా నిర్వహించగలగటం.

– **సుధావితరణం** తాను కూర్మావతారం ధరించిన తరువాత తత్ఫలంగా సముద్రంలో నుండి అమృతం ఉద్భవించిన తరువాత దానిని పంచిపెట్టటానికి సంబంధించినది. అప్పుడు విష్ణువు మోహినీ రూపంతో రాక్షసులను ఏమరపాటుకు గురిచేసి దేవతలకు అమృతాన్ని పంచిపెట్టిన సందర్భానికి సంబంధించినది. అందుకే ఏమరపాటుకు లోనుగాక అమృతాన్ని ఆస్వాదించే ప్రయత్నం చేసి భంగపడిన రాహు ప్రస్తావన కూడా మూడవ పాదంలో కనిపిస్తుంది. అవతారప్రస్తుతితో అవతారఫలప్రస్తుతిని కలపటం కవితా విశేషం.

– **భువననిర్మాణధూతవికృతిః** అన్నది విశిష్టమైన విశేషణం. పరమాత్మ భువన నిర్మాణ సంకల్పం తర్కింపదగినదవుతోంది.

**"ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించన మిషత్ స ఈక్షత లోకాన్ను సృజా ఇతి"** – ఐతరేయోపనిషత్తు 1/1.

**"సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి స తపోఽతప్యత స తపస్తప్త్వా ఇదగ్ం సర్వమసృజత"** – తైత్తిరీయోపనిషత్తు – 2/6

ఇలా ఉపనిషత్తులు సృజనను పరమాత్మ సంకల్పంగా ఘోషిస్తున్నాయి. ఆ సృష్టిలోని ద్వంద్వాలు ప్రధానంగా కనిపించే కార్యకారణ సంబంధాల కందక తర్కానికి గురి అవుతున్నాయి. కాబట్టి పరమాత్మ సృష్టి, దానిలో తాను ప్రవేశించుట నిత్యచర్చా విషయాలుగా నిలిచాయి.

శ్రీమద్భాగవతంలో **"అకూపారాయ బృహతే నమో మందరధారిణే"** –10/40/18 – అని అకూపారంగా కూర్మావతారాన్ని ప్రస్తుతించారు. అకూపారమంటే శ్రీకూర్మమే. అష్టమస్కంధంలో అవతారవిధినిలా వర్ణించాడు వ్యాసుడు.

విలోక్య విఘ్నేశవిధిం తదీశ్వరో – దురంతవీర్యోఽవితథాభిసంధిః।
కృత్వా వపుః కాచ్ఛపమద్భుతం మహత్ – ప్రవిశ్య తోయం గిరిముజ్జహార ॥ –8.7.8

పోతన తెలుగులో కూర్మావతారాన్ని ఇలా ప్రస్తుతించాడు.

సవరనై లక్షయోజనముల వెడలుపై – కడుఁగఠోరమునైన కర్పరమును
నదనైన బ్రహ్మాండమైన నాహరించు – ఘనతరంబగు ముఖగహ్వరంబు

సకల చరాచర జంతురాసుల నెల్ల – మ్రింగి లోఁగొనునట్టి మేటి కడుపు
విశ్వంబుపై వేఱు విశ్వంబు పైఁబడ్డ – నాగినఁగదలని యట్టి కాళ్ళు
వెలికి లోనికిఁజనుదెంచు విపుల తుండ
మంబుజంబులఁబోలెడు నక్షియుగము
సుందరంబుగ విష్ణుండు సురలతోడి
కూర్మి చెలువొంద నొక మహాకూర్మమయ్యె. –పోతనభాగవతము 7/202



**శ్లో॥ ధన్వన్తరేఽఙ్గరుచిధన్వన్తరేఽరితరుధన్వంస్తరీభవ సుధా-**
**భాన్వన్తరావసథ! మన్వన్తరాధికృతతన్వన్తరౌషధినిధే! ।**
**దన్వన్తరఙ్గశుగుదన్వన్తమాజిషు వితన్వన్మమాబ్ధితనయా-**
**సూన్వన్తకాత్మహృదతన్వన్తరావయవతన్వన్తరార్తిజలధౌ ॥ 4**

**అవతారిక :** ధన్వన్తరి స్తుతిరూపమీ శ్లోకం. 'ధన్వంతరి యను పండ్రెండవ తనువున సురాసురమథ్యమాన క్షీరపాథోధిమధ్యభాగంబున నమృతకలశహస్తుండై వెడలె'నని భగవంతుని యేకవింశత్యవతారాలను ప్రస్తావిస్తూ పోతన మాట.

**పదవిభాగము :** ధన్వన్తరే! – అఙ్గరుచిధన్వన్తరే! – అరితరుధన్వన్! – తరీభవ–సుధా
భాన్వన్తరావసథ! – మన్వన్తరాధికృతతన్వన్తర! ఓషధినిధే! ।
దన్వన్తరఙ్గశుగుదన్వన్తమ్ – ఆజిషు – వితన్వన్ మమ – అబ్ధితనయా
సూన్వన్తకాత్మహృదతన్వన్తరావయవతన్వన్తర! – ఆర్తిజలధౌ ॥

**ప్రతిపదార్థము :** అఙ్గరుచిధన్వన్తరే : అంగ = శరీరంయొక్క, రుచి = కాంతితో, ధన్వన్తరే = సూర్యుని వంటి వాడా! (ధన్వన్తరిరినాబ్జయోః – వైజయన్తీ, శేషకాండ–25); అరి...ధన్వన్ : అరి = శత్రువులనెడి, తరు = చెట్లకు, ధన్వన్ = మెట్టనేల వంటివాడా! (మరవః పుంసి ధన్వానః ःవైజయన్తీ, భూమికాండ – 42); సుధా...సథ : (సుధా = అమృతాయమానమైన, భాను = కిరణాలయొక్క, అంతరా = లోతావు, అవసథ = నివాసంగా గలవాడా!) సుధా–భాను = చంద్రునియొక్క, అంతరా = లోతావు, అవసథ = నివాసంగా గలవాడా! (భానుః కిరణసూర్యయోః విశ్వకోశం – నాంత – 20) అంతరాపి వినార్థే స్యాన్మధ్యర్థనికటార్థయోః : అదే – రాంత – 60); మన్వ...తన్వన్తర : మను + అంతర = ఆ యా మన్వంతరాలలో, అధికృత = పొందిన, తను + అంతర = వేరు వేరు రూపాలు గలవాడా!, ఓషధి – నిధే = మందులకు నిధియయినవాడా!, ఆజిషు = యుద్ధాలలో; దన్వన్త...ధన్వన్: దను = దనువుయొక్క (రాక్షసుల తల్లి దనువు), అన్తరంగ = మనస్సులోని, శుక్ = బాధ (శోకము) అనెడి, ఉదన్వన్తమ్ = కడలిని, వితన్వన్ = వృద్ధిపొందింపజేయువాడా; అబ్ధి... యవ : అబ్ధి – తనయా = కడలికూతురు (లక్ష్మి) యొక్క, సూను = కుమారుడైన మన్మథునకు, అన్తక = ప్రాణహర్త అయిన శివునియొక్క, ఆత్మ = బుద్ధినీ (ధైర్యమునూ) (ఆత్మాయత్నో ధృతిర్బుద్ధిస్స్వభావో బ్రహ్మ వర్ష్మ

చ' – అమరకోశం 3/100), హృత్ = హరించునట్టి, అతను = విస్తరించిన, అన్తర = లోనున్న, అవయవ = (శరీర) అవయవాలతో కూడిన, తను + అన్తర = మరొక (మోహినీ) రూపం గలవాడా!, ధన్వన్తరే = ధన్వంతరీ!; ఆర్తిజలధౌ : ఆర్తి = పీడ అనెడి (అర్ద్యతే అనయా ఇతి ఆర్తిః = దీనిచే పీడింపబడటం వలన ఇది ఆర్తి), జలధౌ = సముద్రంలో, మమ = నాకు, తరీభవ = ఓడవు కమ్ము.

**తాత్పర్యము :** ధన్వంతరీ! శరీరకాంతితో నీవు సూర్యసమానుడవు. శత్రువులనే చెట్లకు నీవు మరుభూమి వంటివాడవు. అమృతకిరణాలలోపల నివసించేవాడవు. ఆ యా మన్వంతరాలలో అవసరానుగుణంగా రూపాలను ధరించేవాడవు. ఓషధులకు నీవు నిధివి. యుద్ధవేళలలో దానవుల తల్లియయిన దనువుయొక్క మనోవేదన అనెడి సాగరాన్ని ఉప్పొంగించేవాడవు. మన్మథుని సంహరించిన మహేశ్వరుని హృదయాన్నే అపహరించిన మోహినీ స్వరూపుడవు. కష్టాలకడలినుండి నన్ను తరింపజేయగల ఓడగా నీవు కావాలి.

**విశేషాలు : తరీభవ** – తరి (ఓడ) కానిది తరిగా ప్రవర్తించటం తరీభవనం. 'అభూత తద్భావ ఇతి వక్తవ్య'మ్మనే వార్తికం (3340) ఈ అర్థాన్ని నియంత్రించింది. 'కృభ్వస్తియోగే సంపద్య కర్తరి చ్వీః' అని చ్వి ప్రత్యయం తరి పదం మీద. తరీభవ–లోట్ మధ్యమపురుషైక వచనం.

**అంగరుచిధన్వంతరే** – శరీరకాంతిలో ధన్వంతరి (సూర్యుని) వంటివాడు – ఉపమాలంకారం.

– అరితరు – శత్రువు లనెడి తరువులు
– శుక్ + ఉదన్వన్తమ్ – బాధ అనెడి కడలిని
– ఆర్తి జలధౌ – ఆర్తి అనెడి సముద్రంలో. – ఈ మూడు రూపకాలంకారాలు.

ధన్వంతరిని తనకు నావగా కమ్మని ప్రార్థిస్తూ కవి చేసిన వర్ణనమంతా అది ఆ పరమాత్మకు సాధారణకృత్యమే అనే భావాన్ని ధ్వనింపజేస్తోంది. తాను దేహకాంతితో సూర్యుడు కాగలిగాడు. అరితరువులకు మెట్టనేల కాగలిగాడు. మనోవేదనను కడలిగా పెంపొందింప గలిగాడు. మన్వంతరాలలో తన్వంతరాలను (వేరువేరు రూపాలను) పొందగలిగాడు. చివరకు తాను సంహరించిన మదనుని చేతికి తానే చిక్కుకొనేటట్లు పరమేశ్వరుని లోగొనగల మోహినీ రూపాన్ని ధరింపగలిగాడు. ఇక తనను కష్టాల కడలి నుండి తరింపజేయగల నావ కావటమెంత పని! తన కోరికలోని ఆశావహ దృక్పథాన్ని ధ్వనింపజేస్తోంది వర్ణనమంతా.

అంశావతారాలలోని చమత్కారం ఈ ధన్వంతరిలో కనిపిస్తుంది. విష్ణువు తాను కూర్మరూపంలో మందరపర్వతాన్ని వీపున మోస్తున్నాడు. అదే సమయంలో కడలినుండి పుట్టిన లక్ష్మితో కరగ్రహణం చేశాడు. అప్పుడే అమృతభాండాన్ని చేతబట్టి ధన్వంతరి రూపంగా అవతరిస్తున్నాడు.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ (భగవద్గీత 6–30)

ఈ గీతావాక్యాలను అనుసంధానం చేయటానికి ఇటువంటి సన్నివేశాలు సహకరిస్తాయి.

– **మన్వంతరాధికృతతన్వంతరః –** ఏడవ విగ్రహంబున నాకూతియందు రుచికి జన్మించి యజ్ఞుండనఁబ్రకాశమానుండై యమాదిదేవతలంగూడి స్వాయంభువ మన్వంతరంబు రక్షించె... చాక్షుష మన్వంతర సంప్లవంబున దశమంబయిన మీనావతారంబు నొంది మహీరూపంబగు నావనెక్కించి వైవస్వత మనువు నుద్ధరించె" (పోతన భాగవతము 1/63)

– కృత త్రేతా ద్వాపర కలియుగాల మొత్తం ఒక చతుర్యుగం / మహాయుగం / దేవయుగం. డెబ్బది యొక్క మహాయుగాలు ఒక మన్వంతరకాలం. ప్రస్తుతం జరుగుతున్నది వైవస్వతమన్వంతరం.

– ధన్వంతరిని గురించిన ప్రసక్తి రామాయణంలో, భాగవతంలో, హరివంశంలో, బ్రహ్మవైవర్తపురాణంలో కూడా కనిపిస్తుంది. సర్వావతారప్రసక్తి ఉన్న అన్ని తావులలోనూ కనిపిస్తుంది.

అథోదధేర్మథ్యమానాత్ కాశ్యపైరమృతార్థిభిః ।
ఉదతిష్ఠన్మహారాజ పురుషః పరమాద్భుతః ॥

దీర్ఘపీవరదోర్దండః కంబుగ్రీవోఽరుణేక్షణః ।
శ్యామలస్తరుణః స్రగ్వీ సర్వాభరణభూషితః ॥

పీతావాసా మహోరస్కః సమ్మృష్టమణికుండలః ।
స్నిగ్ధకుంచిత కేశాంతః సుభగః సింహవిక్రమః ॥

అమృతాపూర్ణకలశం బిభ్రద్వలయభూషితః ।
స వై భగవతస్సాక్షాత్ విష్ణోరంశాంశసంభవః ॥

ధన్వన్తరిరితి ఖ్యాతః ఆయుర్వేదదృగిజ్యభాక్ । భాగవతమ్ 8/8/31-35

తరుణుండు దీర్ఘదోర్దండుండు గంబుకం – ధరుఁడు పీతాంబరధారి స్రగ్వి
లాలితభూషణాలంకృతుండరుణాక్షుఁ – డున్నతోరస్కుఁడత్యుత్తముండు
నీలకుంచితకేశనివహుండు జలధర – శ్యాముండు మృగరాజ సత్త్వశాలి
మణికుండలుఁడు రత్నమంజీరుఁడచ్యుతు – నంశాంశసంభవం డమలమూర్తి

భూరియాగభాగభోక్త ధన్వంతరి – యనఁగ నమృతకలశహస్తుఁడగుచు
నిఖిలవైద్యశాస్త్ర నిపుణుఁడాయుర్వేది– వేల్పు వెజ్జు కడలి వెడలి వచ్చె

(పో. భా. 8/293)

తన చతుర్వర్గచింతామణిలో హేమాద్రి చేసిన ధన్వంతరి స్తోత్రమిది –

శ్లో॥ శంఖం చక్రం జలౌకాం దధదమృతఘటం చారుదోర్భిశ్చతుర్భిః
సూక్ష్మస్వచ్ఛాతిహృద్యాంశుకపరివిలసన్మౌళిమంభోజనేత్రమ్ ।
కాలాంభోదోజ్జ్వలాంగం కటితట విలసచ్చారుపీతాంబరాఢ్యం
వందే ధన్వంతరిం తం నిఖిలగదవనప్రౌఢదావాగ్నిలీలమ్ ॥



శ్లో॥ యా క్షీరవార్ధిమథనాక్షీణదర్పదితిజాక్షోభితామరగణా
పేక్షాప్తయేఽజని వలక్షాంశుబింబజిదతీక్ష్ణాలకావృతముఖీ ।
సూక్ష్మావలగ్నవసనాక్షేపకృత్కుచకటాక్షాక్షమీకృతమనో
దీక్షాసురాహృతసుధాక్షాణి నోఽవతు సురూక్షేక్షణాద్ధరితనుః ॥ 5

**అవతారిక :** అసురులనుండి అమృతభాండాన్ని లాగికొని నేర్పుగా దేవతలకు మాత్రమే అమృతాన్ని అందించటానికి అవతరించిన మోహినీస్తుతిపరమీ శ్లోకం, ఆ పై శ్లోకం కూడా.

**ప్రతిపదార్థము :** యా = ఏ శరీర(రూప)ం; క్షీర....ప్తయే : క్షీర-వార్ధి = పాలకడలిని, మథన = చిలుకుటయందు, అక్షీణ = నశించని, దర్ప = అహంకారంగల (దర్పో భవే దహంకారే దర్పో మృగమదేఽపి చ) విశ్వలోచనకోశం - పాంతవర్గం - 6), దితి-జ = దితికుమారుల (రాక్షసుల)చే, ఆక్షోభిత = మిక్కిలిగా కలతబెట్టబడిన, అమరగణ = దేవతలయొక్క, అపేక్షా = వాంఛ (కోరిక)ను, ఆప్తయే = నెరవేర్చుటకై, అజని = పుట్టినదో, (జనీ ప్రాదుర్భావే లుఙ్ ప్రథమపురుషైకవచనం); వల....ముఖీ : వలక్ష + అంశు = చంద్రునియొక్క (వలక్షపదం బలక్షపదానికి పర్యాయంగా ఏర్పడింది. బలక్ష అంటే బలం క్షాయతి అస్మాత్. దీని వలన బలం నశిస్తుంది అని అర్థం. ద్విరదదంత బలక్షమలక్ష్యత స్ఫురిత భృంగమృగచ్ఛవికేతకం. శిశుపాలవధ 6-34. వలక్షపదానికి తెల్లని అని అర్థం. తెల్లని కిరణాలు గలవాడు కాబట్టి వలక్షాంశువంటే చంద్రుడని అర్థం. చూ- Sanskrit English Dictionary - V.S. Apte 790 P.), బింబ = నిండుదనమును (బింబో స్త్రీ మండలం త్రిషు అని అమరకోశం. బింబతి భాతి బింబమాభోగ- అని అమరకోశాద్ఘాటనవ్యాఖ్య- నామలింగానుశాసనం 17/16), జిత్ = గెలిచెడి, అతీక్ష్ణ = మృదువయిన, అలక = ముంగురులచే (అలకా కుబేర పుర్యామస్త్రియాం చూర్ణకుంతలే - మేదినీ కోశం - 41), ఆవృత = కప్పబడిన, ముఖీ = మోము గలదియు; సూక్ష్మా....సుధా : సూక్ష్మ = సన్నది అయిన, అవలగ్న = నడుముపైగల (అవలగ్నోఽస్త్రియాం మధ్యే లగ్నమాత్రే త్రిలింగకః - శబ్దరత్నసమన్వయకోశః - సచతుర్థ-8), వసన = వస్త్రమును, ఆక్షేప-కృత్ = తొలగింపజేయు, కుచ = రొమ్ములచేతను, కట+అక్ష = స్వల్పమైన కంటిచూపుచే / కడగంటి చూపుచే (కటః శ్రోణౌ శవేఽత్యల్పే కిలింజగజగండయోః) విశ్వలోచనకోశః - టద్వితీయ-5), అక్షమీకృత = అసమర్థముగా చేయబడిన, మనః = మనస్సును, దీక్షా = పట్టుదలయు గల (మనోదీక్షా = మానసికమయిన సంకల్పంగల), అసుర = రాక్షసులనుండి, ఆహృత = లాగికొనబడిన, సుధా = అమృతము గలదియు (అయిన), (సా) హరితనుః = ఆ మోహినీ స్వరూపం, నః = మనయొక్క, అక్షాణి = శరీరావయవాలను (అక్షం స్యాదింద్రియే క్లీబం తుత్థే సౌవర్చలేఽపి చ । విశ్వలోచనకోశః - షాంత - 2); రూక్షేక్షణాత్ : రూక్ష = క్రూరమయిన, ఈక్షణాత్ = చూపునుండి, అవతు = కాపాడునుగాక (అవ రక్షణే లోట్ ప్రథమపురుషైకవచనం).

**తాత్పర్యము :** మోహినీ స్వరూపాన్ని శ్రీహరి స్వీకరించటానికి కారణం దేవతల అపేక్షను పూర్తిచేయటం. పాలకడలిని చిలకటం వలన అమృతం పుట్టింది. అయితే దర్పాతిశయంతో రాక్షసులు దేవతలను కలతపెట్టారు. ఆ కలత మాన్పటానికి మోహినీ స్వరూపాన్ని స్వీకరించాడు విష్ణువు. చంద్రబింబాన్ని గెలవగల ముఖం. ఆ ముఖంపై చెదరని కురులు. సన్నని నడుము. అ నడుముపై నున్న వస్త్రాన్ని

జార్చే రొమ్ములు. కడగంటి చూపులు. ఆ చూపులతో దైత్యుల మనోదీక్ష సడలింది. పర్యవసానంగా వారి చేతి అమృతభాండం మోహిని చేతికి వచ్చింది. అటువంటి మోహినీ స్వరూపం క్రూర దృక్కులనుండి మా శరీరావయవాలను కాపాడుగాక (మాకు దృష్టిదోషం తగులకుండా కాపాడుగాక).

**విశేషాలు :** ఈ శ్లోకం విలక్షణంగా వస్తువర్ణనాత్మకంగా మనోరంజక మవుతోంది. సాధారణంగా వర్ణనలలో కనిపించే ఉపమాతిశయోక్తుల వంటి అలంకారస్పర్శ లేకుండా కథావిషయాన్ని ముచ్చటగా ముచ్చటిస్తున్నట్లుగా వుంది. కేవలం 'వలక్షాంశు బింబజిత్' అన్నచోట అతిశయోక్త్యలంకారం వుండీ లేనట్లు కనిపిస్తోంది.

**అక్షమీకృత–** అన్న ప్రయోగంలో 'చ్వి' ప్రత్యయం – అభూతతద్భావబోధకం – సార్థకంగా వుంది. స్వతఃసమర్థులయి కూడా అసమర్థులుగా చేయబడ్డారని వర్ణించటం మోహినీ రూపంలోని వశీకరణశక్తి, తద్ద్వారా పరమాత్మస్వరూపుడైన నారాయణునిలోని విశ్వవ్యాపకత్వం ధ్వనిస్తాయి.

సుప్తిఙ్ వచన సంబంధైః తథా కారకశక్తిభిః ।
కృత్తద్ధితసమాసైశ్చ జ్ఞేయోऽలక్ష్యక్రమధ్వనిః ॥

అని ఆనందవర్ధనుడు (ధ్వన్యాలోకం) సంభావించినది ఇటువంటి సందర్భాలనే.

ఈ అక్షమీకరణ కారణంగా కుచకటాక్షాలను ప్రకటించారు రచయిత. "నారీస్తనభారనాభీదేశం, దృష్ట్వా మాగా మోహావేశమ్' అన్నది భజగోవిందశ్లోకం.

**'రూక్షేక్షణాత్' –** రూక్షేక్షణ ప్రస్తావన ఇక్కడెందుకు వచ్చిందో ఆశ్చర్యకరం. రాక్షసులను వివశులను చేస్తున్న మోహినీరూపంలోని కటాక్షాలలో దేవతలకు రూక్షేక్షణత్వం ఎందుకు కనిపిస్తుంది?

పాలకడలిని చిలకటంలోని వ్యూహాత్మక లోపాలను గుర్తుచేస్తూ విష్ణుమూర్తి కోపిస్తున్నాడా? ఇప్పటికే కూర్మరూపంలో మందరపర్వతాన్ని నిలపవలసి వచ్చింది. ఇంతలోనే దేవతల అమృతభాండాన్ని కాపాడుకోలేకపోవటంతో మరల మోహినీరూపాన్ని ధరించవలసి వచ్చింది. ఇంత చేతకానితనానికి, వ్యూహ వైఫల్యానికి దేవతలపై కోపించటంలో అనౌచిత్యమేమీ లేదు. అందుకే దైత్యులపై కటాక్షాలను ప్రసరింపజేస్తూ కూడా, దేవతలపై రూక్షదృక్కులను ప్రసరింపజేసి వుండవచ్చు. లక్ష్యం దైత్యవంచన కాబట్టి దాన్ని మాత్రమే కవి వాచ్యం చేసి వుండవచ్చు. ఆ రూక్షదృక్కులనుండి మరల తమను ఆ మోహినీరూపంలోని విష్ణువే కాపాడాలి. కాబట్టి హరితనుః అని సాభిప్రాయ విశేష్యం. పోనీ దీన్ని పరికరాంకురాలంకార మందాం. లేదా లోకమంతా దేవతల ప్రవర్తనపై కోపాన్ని ప్రదర్శించవచ్చు. ఆ రూక్షేక్షణం నుండి కూడా హరియే కాపాడాలి. లేదా దేవతలకు అమృతభాండం దక్కుతోంది కాబట్టి ఎవరికైనా కుళ్ళుపుట్టి దిష్టి పెట్టవచ్చు. ఆ దృష్టిదోషం నుండి కూడా శ్రీహరియే కాపాడాలి గదా!

సంస్కృతభాగవతంలో **మోహినీస్వరూపవర్ణన**మిలా వుంది.

ఏతస్మిన్నన్తరే విష్ణుః సర్వోపాయవిదీశ్వరః ।
యోషిద్రూపమనిర్దేశ్యం దధార పరమాద్భుతమ్ ॥

ప్రేక్షణీయోత్పలశ్యామం సర్వావయవసుందరమ్ ।
సమానకర్ణాభరణం సుకపోలోన్నసాననమ్ ॥

నవయౌవననివృత్తస్తనభారకృశోదరమ్ ।
ముఖమోదానురక్తాలి ఝుంకారోద్విగ్నలోచనమ్ ॥

బిభ్రత్ స్వకేశభారేణ మాలాముత్ఫుల్లమల్లికామ్ ।
సుగ్రీవకంఠాభరణం సుభుజాంగదభూషితమ్ ॥

విరజాంబరసంవీత నితంబద్వీపశోభయా ।
కాంచ్యా ప్రవిలసద్వల్గు చలచ్చరణనూపురమ్ ॥

సవ్రీడస్మితవిక్షిప్త భ్రూవిలాసావలోకనైః ।
దైత్యయూథపచేతస్సు కామముద్దీపయన్ ముహుః ।

శ్రీమద్భాగవతమ్ 8/8/41-46.

పోతన చిత్రీకరణ - పోతనభాగవతము 8/301

మెత్తని యడుగుల మెఱుఁగారు జానువు లరటి కంబములదోయైన తొడలు
ఘనమగు జఘనంబుఁ గడులేతనడుమును బల్లవారుణకాంతి పాణియుగము
గడుదొడ్డ పాలిండ్లుఁగంబుకంఠంబును బింబాధరముఁ జంద్రబింబముఖము
దెలిగన్ను గవయును నళికుంతలంబున బాలేందుసన్నిభఫాలతలము
నమరఁ గుండలకేయూర హార, కంకణాదులేపార మంజీరనాద మొప్ప
నల్లనవ్వులఁ బద్మదళాక్షుఁడమర పతుల నడఁగింప నాఁడురూపంబుఁ దాల్చి.



**శ్లో॥ శిక్షాదియుఙ్నిగమదీక్షాసులక్షణపరీక్షాక్షమా విధిసతీ**
**దాక్షాయణీ క్షమతి సాక్షాద్రమాపి న యదాక్షేపవీక్షణవిధౌ ।**
**ప్రేక్షాక్షిలోభకరలాక్షారసోక్షితపదాక్షేపలక్షితధరా**
**సాఽఽక్షారితాత్మతనుభూక్షారకారి నిటిలాక్షాఽక్షమానవతు నః ॥ 6**

**అవతారిక:** ఈ శ్లోకం కూడా **మోహినీవిశేషవర్ణనాత్మకం**. అవతారప్రయోజనం సిద్ధించిన తర్వాత కూడా అనుబంధంగా సాగిన ఘటన కిది రూపకల్పన.

**ప్రతిపదార్థము:** శిక్షాది...క్షమా : శిక్షా + ఆది = శిక్ష మొదలుగాగల వాటితో, యుక్ = కూడియున్న, నిగమ = వేదాలమీదగల, దీక్షా = శ్రద్ధయొక్కయు (ఏతద్దీక్షాయై (రూపం) యచ్ఛ్రద్ధా - శతపథబ్రాహ్మణమ్ 12-8-214), సులక్షణ = మంచి లక్షణాలయొక్కయు, పరీక్షా = నిగ్గుదేల్చి చూచుటయందు, క్షమా = సమర్థత గల, విధి-సతీ = బ్రహ్మదేవుని భార్య (సరస్వతి), దాక్షాయణీ = దక్షుని కుమార్తెయు (సతీదేవియు) (దక్షస్య అపత్యం స్త్రీ దాక్షాయణీ), సాక్షాత్ = ప్రత్యక్షంగా (అసలుకు), రమా + అపి = లక్ష్మియు; యదాః... విధౌ : యత్ = ఎవర్తుకయొక్క, ఆక్షేప = విసురుతో కూడిన,

వీక్షణ = చూచుట అను, విధౌ = పనియందు (విధానమందు), న క్షమతి = సమర్థులు కారో... (అటువంటి...); ప్రేక్షా... ధరా : ప్రేక్షా = బుద్ధికిని (ప్రేక్షోపలబ్ధిః చిత్సంవిత్ ప్రతిపద్జ్ఞప్తిచేతనా – అమరకోశం – ధీవర్గః –1), అక్షి = కన్నులకును, లోభ = అత్యాశను, కర = కలిగించుకట్టిదై, లాక్షా–రస = లత్తుకచేత, ఉక్షిత = తడుపబడిన, పద = కాళ్ళయొక్క, ఆక్షేప = ఆకర్షణ (లాగుట) చేత, లక్షిత = గుర్తింపబడిన (లత్తుకతో కూడిన పాదముద్రలే పచ్చబొట్టులా గుర్తులుగా నిలిచిపోయాయి), ధరా = భూమిగలదియు; ఆక్షారి... లాక్షా: ఆక్షారిత = నిందింపబడిన (క్షారితః స్రావితేక్షారేచాభిశస్తేఽపి చ త్రిషు – మేదినీకోశః – తాంత – 61–104), ఆత్మ–తను–భూ = తన శరీరం నుండి పుట్టినవాడును అయిన మన్మథుని (శృంగారయోనిః శ్రీపుత్రః శూర్పకారాతిరిత్యపి – అమరకోశః – వావిళ్ళప్రతి), క్షార = భస్మముగా (క్షారో రసాంతరే ధూర్తే లవణే కా చ భస్మనోః – మేదినీకోశః – రాంతవర్గః – 123–14), కారి = చేసిన, నిటిల + అక్షా = నుదుటి కంటివాడు, గలదియు అయిన (నిటల, నిటిల – పర్యాయపదాలు), సా = ఆ మోహిని, అక్షమాన్ = అసమర్థులమయిన, నః = మనలను, అవతు = కాపాడునుగాక (అవ రక్షణే లోట్ ప్రథమపురుషైకవచనం).

**తాత్పర్యము :** శిక్షాదిషడంగాలతో కూడిన ఆగమాలను, ఆగమదీక్షలనూ, లక్షణాలనూ పరీక్షించగల జ్ఞాన స్వరూప సరస్వతి, దక్షుని పుత్రిక సతీదేవి, మోహినిరూపంలో వున్న నారాయణుని పత్ని లక్ష్మి, ఈ ముగ్గురు కూడా మోహిని చూపుల విసురులను భరించలేక పోతున్నారు.

ఆ మోహిని పాదాలకద్దిన లత్తుక చూపరుల బుద్ధినీ, కళ్ళనూ కూడా అత్యాశకు గురిచేస్తోంది. ఆ పాదాల గుర్తులతో భూమికి గుర్తింపు వస్తోంది.

మన్మథుడు తన కుమారుడు. నిందకు గురియై భస్మమయినాడు. అలా భస్మం చేసిన మహేశ్వరుని తన రూపంతో సిగ్గుపడచేసింది మోహిని. అటువంటి మోహిని మనలను కాపాడుగాత.

**విశేషాలు :** శిక్ష – వ్యాకరణం – ఛందస్సు – నిరుక్తం – జ్యౌతిషం – కల్పం – ఈ ఆరూ వేదాంగాలు ... "షడంగో వేదో అధ్యేతవ్యః" అని విధి. వేదార్థజ్ఞానాన్ని పొంది తద్ద్వారా వేదాధ్యయనాన్ని సార్థకం చేసుకోవాలంటే షడంగాధ్యయనం అనివార్యం.

**దీక్షా** పదాన్ని విస్తృతార్థంలో ప్రదర్శించాయి బ్రాహ్మణ గ్రంథాలు – తైత్తిరీయ బ్రాహ్మణం దీక్షనిలా వివరించింది :-

"ప్రజాపతిరకామయతాశ్వమేధేన యజేయేతి. సతపోఽ తప్యత. తస్య తేనాపానస్య సప్తాత్మనోః దేవతా ఉదక్రామన్. సా **దీక్షా** భవత్" – తైత్తిరీయబ్రాహ్మణం 3–8–101

తైత్తిరీయ బ్రాహ్మణమే (3–7–7) ప్రాణాలను, వాక్కును, నీటిని, దిక్కులను, నేలను, అంతరిక్షాన్ని, స్వర్గాన్ని, ఓషధులను దీక్షారూపాలుగానే వివరించింది. ఐతరేయ బ్రాహ్మణం ఋత, సత్యాలను కూడా దీక్షలుగా చెప్పింది (ఐతరేయబ్రాహ్మణం. 1–6).

**దేవి! దీక్షా విహీనస్య న సిద్ధిర్న చ సద్గతిః ।**
**తస్మాత్ సర్వప్రయత్నేన గురుణా దీక్షితో భవేత్ ॥**

అని తంత్రసారం (420) దీక్షాప్రాధాన్యాన్ని ప్రకటించింది. దీక్ష (శ్రద్ధ) లేకపోతే సిద్ధి కానీ, సద్గతికానీ కలుగవు. అందుకే **'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం'** అని వ్యాసమహర్షి కూడా ధ్రువీకరించాడు.

రెండవ పాదంలో 'సాక్షాద్రమాపి' అని లక్ష్మి విషయంలోనే 'సాక్షాత్' అన్న విశేషణాన్ని వాడటం కవితా చమత్కృతి. సరస్వతి, సతి = వారిద్దరి విషయం వేరు. జ్ఞానరూప సరస్వతి. దీక్షారూప సతి. కాని లక్ష్మి మోహినీరూపానికి ముందు నారాయణుని తన కనుసన్నలలో ఉంచుకొనగలిగింది. అటువంటి లక్ష్మికూడా మోహినియొక్క ఆక్షేపవీక్షణాలు సహించలేకపోయింది.

రెండవ పాదంలో **'న క్షమతి'** అని లక్ష్మి, పార్వతి, సరస్వతుల పరంగా వాడి, అదే పదాన్ని అక్షమాన్ నః అని నాలుగవ పాదంలో స్తోతృ, భక్తపరంగా వాడటం కూడా అందగింపే. అంతటివారికే కుదరనిది తమకెలా కుదురుతుందని వాచ్యంగా చెప్పటం. ఇక్కడ **కావ్యార్థపత్త్యలంకారధ్వని** వుంటుంది.

మహేశ్వరునిలో కలిగిన కామవికారాన్ని, భావోదయాన్ని పోతన ఇలా చక్కగా వర్ణించాడు.

**ఈ కాంతాజనరత్నమెవ్వరిదొకో? యీ యాఁడురూపంబు ము**
**న్నే కల్పంబులయందుఁ గానమజుఁడీ యింతిన్ సృజింపంగఁ దా**
**లేకుంటెల్ల నిజంబు వల్లభత నీ లీలావతిం జేరఁగా**
**నే కాంతుఁడు గలండొ క్రీడలకు నాకీ యింతి సిద్ధించునే.**



శ్లో॥ **లీలామ్బుదాభ! శుభశీలాద్రిదేహధర! ఖేలాధృతోదధిధునీ-**
**శైలాదియుక్తనిఖిలేలాకటాద్యసురతూలాటవీదహన! తే ।**
**కోలాకృతే జలధికాలాచలావయవనీలాబ్జదంష్ట్ర! ధరణీ-**
**లీలాస్పదోరు!తరుమూలాదియోగివరజాలాభివందిత! నమః॥** 7

**అవతారిక :** హిరణ్యాక్షుడు భూమిని చాపలా చుట్టి సముద్రంలో పడవేసినప్పుడు దాని నుద్ధరించటానికి శ్రీమహావిష్ణువు వరాహరూపమెత్తాడు. దానిని వర్ణించే శ్లోకమిది.

**ప్రతిపదార్థము :** నీలా....దాభ : నీల + అంబుద = నల్లని మేఘంవంటి, ఆభ! = కాంతిగలవాడా!, శుభ – శీల! = కళ్యాణకరమైన స్వభావం గలవాడా!; అద్రి...ధర! : అద్రి = కొండవంటి (పెద్దదయిన), దేహ = శరీరాన్ని, ధర = ధరించినవాడా!; ఖేలా.... దహన! : ఖేల = క్రీడార్థమై, ఆధృత = పూర్తిగా ధరింపబడిన, ఉదధి = సముద్రాలు, ధునీ = నదులు, శైల = కొండలు, ఆది = మొదలగువానితో, యుక్త = కూడియున్న, నిఖిల = సమస్తమైన, ఇలా = భూమి అనెడి, కట = చాప గలిగిన, ఆద్యసుర = తొలివేలుపు రక్కసి అనెడి, తూల = దూదిరూపమైన, అటవీ = అరణ్యానికి, దహన! = అగ్నివంటివాడా!; జలధి – కాల! = సముద్రంవలె నల్లనైన వాడా!; అచలా....దంష్ట్ర : అచలా = భూమికి ("భూర్భూమిరచలానన్తా ధరా విశ్వంభరా స్థిరా" అమరకోశం – భూమివర్గః-1), అవయవ = అవయవాల వలెనున్న, నీల + అబ్జ = నల్లకలువలవంటి, దంష్ట్ర! = కోరలు గలవాడా;

ధరణీ....దోరు! : ధరణీ = భూమియొక్క, లీలా = విలాసాలకు, ఆస్పద = ఆధారమైన, ఊరు! = తొడలుగలవాడా!; తరు....వందిత : తరు = చెట్లయొక్క, మూల = వ్రేళ్ళను, అశి = తినెడి (అశభక్షణే ధాతువుపై ణిని ప్రత్యయం), యోగి యోగులలో (మునులలో), వర = శ్రేష్ఠులయొక్క, జాల = సమూహంచేత, అభివందిత = నమస్కరింపబడినవాడా!, కోల + ఆకృతే = వరాహ స్వరూపా! (వరాహ : శూకరోఘృష్టిః కోలః పోత్రో కిరః కిటిః – అమరకోశం 2.సింహాది.2), తే = నీకు (నీ కొరకు) (నమః స్వస్తి స్వాహా స్వధాలం వషడ్యోగాచ్చ – అని చతుర్థీవిభక్తి), నమః = నమస్కారం.

**తాత్పర్యము :** వరాహ స్వరూపా! కారుమొయిలు వంటి రూపంతో ప్రకాశించేవాడవు నీవు. కళ్యాణకరమైన స్వభావం గలవాడవు. కొండవలె పెద్ద శరీరంగలవాడవు. రాక్షసుడు సముద్రాలు, నదులు, పర్వతాలతో సహా భూమిని విలాసంగా చుట్టివేసినపుడు ఆ రాక్షసుడనెడి దూది అడవికి అగ్నివి నీవు. కడలివలె నల్లనివాడవు. భూమికి అవయవాలవలె సొబగులీనెడి నల్ల కలువల వంటి కోరలు గలవాడవు. నీ తొడ భూమికి క్రీడా ప్రదేశం. తరుమూలాలను తినే యోగిశ్రేష్ఠులు నీకు నమస్కరిస్తుంటారు. అటువంటి నీకు (నా) నమస్సు.

**విశేషాలు :** కోలశబ్దానికి తెప్ప (ఉడుపంతు ప్లవః కోలః – అమరకోశం 1.వారి.11) అని కూడా అర్థముంది. తెప్పలాంటివాడా అని 'కోలాకృతే' అన్న పదానికి అర్థం చెప్పినా అందమే. అయితే అప్పుడు విశేష్యం లోపిస్తుంది.

'జలధికాల' అన్నచోట కాలశబ్దానికి పరమేశ్వరుడని అర్థం చెప్పవచ్చు. నిఘంటువులు ప్రస్తావించాయి. (వాచస్పత్యం తృతీయసంపుటం) "కాలః కలయతా మహమ్" అన్న గీతావచనాన్నిబట్టి (భగవద్గీత 10–30) "ఋతుస్సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః" అన్న విష్ణుసహస్రనామ సందర్భాన్ని బట్టి కాలశబ్దానికి పరమేశ్వరార్థాన్ని కూడా సూచించారు. అప్పుడు 'జలధికాల' పదానికి జలంలో వ్యాపించిన పరమేశ్వరుడని చెప్పవచ్చు. ఇది అభివ్యాపకమైన అధికరణం.

**కల గతౌ సంఖ్యానే చ** అన్న ధాతువుమీద నుండి కలయతి ఇతి కాలః అన్న వ్యుత్పత్తితో కాలశబ్దాన్ని గత్యర్థకంగా స్వీకరిస్తే సముద్రమందు సంచరించినవాడా అని జలధికాలశబ్దానికి అర్థం చెప్పవచ్చు. లేదా సంఖ్యానార్థకంలో జలధిని కొలిచినవాడా అని అయినా చెప్పవచ్చు. సముద్రాన్ని అల్లకల్లోలం చేసినవారు కాబట్టి ఆయన సముద్రాన్ని కొలిచినట్లే. పాతాళపర్యంతమూ సంచరించారు గదా!

**నీలాబ్జదంష్ట్ర –** అని కోరలను నల్లకలువలతో పోల్చాడు కవి. సాధారణంగా కోరల రంగు తెలుపు. కాకపోతే ఆ వరాహమూర్తి శరీరం నీలాంబుదం వంటిది కాబట్టి ఆ రంగు కోరలపై ప్రతిఫలించి అవి నల్లకలువల వలె ఉన్నాయని భావించాలి.

**– నాలుగవ పాదంలో 'లీలాస్పదోరుతర...'** అని అన్ని పాఠాలు చెప్తున్నాయి. కానీ అది సంగతమనిపించలేదు. లీలాస్పద + ఊరుతర. లీలాస్పదమయిన ఊరువుల వరకు సమస్య లేదు. ఆపై తరప్ ప్రత్యయం. తరప్ ప్రత్యయాన్ని విశేషణాల మీద వాడవచ్చు తర తమ భేదాన్ని

సూచించటానికి. కానీ ఊరువులు విశేషణాలు కావు. ఊరు పదంపై తరప్ ప్రత్యయప్రయోగానికి అవకాశం లేదు. (ద్వయోర్మధ్యే అన్యతరాపేక్షయా అతిశయవిశిష్టస్వార్థవృత్తేః విభాగప్రయోజకీభూత ధర్మవాచకాచ్చ శబ్దాత్ స్వార్థే తరబీయసునౌస్తః – బాలమనోరమా – సిద్ధాంతకౌముదీ 2005 సూత్ర వ్యాఖ్య) కాబట్టి అది తరు పదమై యుండవచ్చునని భావించి ఆ పాఠాన్ని సవరించాను. అప్పుడు **'తరుమూలాశి'** అన్న కొనసాగింపు కూడా కుదురుతోంది.

– వరాహావతారం రెండు సందర్భాలలో ఒకే ప్రయోజనం కోసం జరిగింది. స్వాయంభువ మనువు సృష్టిచేయాలని సంకల్పించినప్పుడు భూమి అవసరం ఏర్పడింది. అప్పటికే భూమి నీళ్ళలో మునిగివుంది. అప్పుడు బ్రహ్మ విష్ణుమూర్తికి మాత్రమే భూమ్యుద్ధరణం కుదురుతుందని సంకల్పించగా బ్రహ్మ నాసికారంధ్రం నుండి యజ్ఞవరాహ శిశువు ఉద్భవించి క్షణాలలో మహాకృతిని పొంది భూమిని ఉద్ధరించాడు, అడ్డగించిన అసురులను సంహరించి.

ఆపై భూమి విష్ణువుపై ప్రీతితో అతనిని కౌగిలించుకొంది. ఆ కౌగిలి ఒక దివ్యసంవత్సరం పాటుంది. అప్పుడు అలసి ఒరిగిపోతున్న భూమిని మరల వరాహమూర్తియై విష్ణువు నిలిపాడు.

భాగవతం తృతీయస్కంధంలోనూ, దేవీభాగవతంలోని అష్టమ నవమ స్కంధాలలోనూ, అగ్నిపురాణంలోనూ, పద్మపురాణంలోనూ యజ్ఞవరాహమూర్తి కథ కనిపిస్తుంది. అయితే అగ్నిపురాణం మామూలుగా దేవసంరక్షణ కోసం విష్ణుమూర్తి అవతారాలు అన్న భావనకు అనుగుణంగా రెండున్నర శ్లోకాలలో యజ్ఞవరాహ విషయాన్ని ప్రస్తావించింది.

అవతారం వరాహస్య వక్ష్యేఽహం పాపనాశనమ్ ।
హిరణ్యాక్షోఽసురేశోఽభూత్ దేవాన్ జిత్వా దివిస్థితః ॥

దేవైర్గత్వా స్తుతో విష్ణుః యజ్ఞరూపో వరాహకః ।
అద్భుతం దానవం హత్వా దైత్యైః సాకం చ కంటకమ్ ॥

ధర్మదేవాదిరక్షాకృత్ తతస్సోంతర్దధే హరిః ॥ – అగ్నిపురాణమ్ 4 / 1–3



**శ్లో॥ దంభోళితీక్ష్ణనఖసంభేదితేంద్రరిపుకుంభీంద్ర! పాహి కృపయా
స్తంభార్భకాసహన! డింభాయ దత్తవర! గంభీరనాద! నృహరే! ।
అంభోధిజానుసరణాంభోజభూపవనకుంభీనసేశఖగరాట్–
కుంభీంద్రకృత్తిధరజంభారిషణ్ముఖముఖాంభోరుహాభినుత! మామ్ ॥ 8**

**అవతారిక :** నృసింహశరణాగతి ఈ శ్లోకంలో ప్రధానాంశం. ప్రసిద్ధ దశావతారాలలో నృసింహావతారం నాలుగవది. ఆ నృసింహ స్తుతి ఇది.

**ప్రతిపదార్థము :** దంభోళితీక్ష్ణనఖసంభేదితేంద్రరిపుకుంభీంద్ర : దంభోళి = వజ్రాయుధంవలె (పవిరశనిః శతధారం వజ్రం కులిశం చ భవతి దంభోళిః – హలాయుధకోశః–56), తీక్ష్ణ = పదునైన, నఖ = గోళ్ళచే, సంభేదిత = చీల్చబడిన, ఇంద్ర = ఇంద్రునియొక్క, శత్రు = శత్రువయిన హిరణ్యకశిపుడనే,

కుంభి + ఇంద్ర! = గజరాజు గలవాడా!, స్తంభ + అర్భక! = స్తంభం నుండి పుట్టిన శిశువా!, అసహన! = సహనం లేనివాడా! (తన భక్తుల తిరస్కారాన్ని సహించలేనివాడు), డింభాయ = పసివానికి (డిమ్భౌతు శిశుబాలిశౌ – అమరకోశం–నానార్థ–135), దత్తవర! = ఇవ్వబడిన వరాలు గలవాడా! (దత్తః వరః యేన సః), గంభీర–నాద! = గంభీరమైన అరుపు గలవాడా!; అంభోధిజా + అనుసరణ : అంభోధి–జా = జలనిధినుండి పుట్టిన లక్ష్మిని, అనుసరణ = అనుసరించువాడా! (అంభోధిజాయాః అనుసరణం యస్య తస్మాత్ సంబుద్ధౌ); అంభోజ....అభినుత : అంభోజ = బ్రహ్మ, పవన = వాయువు, కుంభీనస + ఈశ = పాముల ఱేడు ఆదిశేషుడు (కుంభీనసో లోహితాహిః కృష్ణసర్పః కులస్థకః – వైజయన్తీ–సరీసృప–12), ఖగ–రాట్ = పక్షిరాజు / గరుత్మంతుడు (ఖే గచ్ఛన్తి ఇతి – తేషాం రాట్), కుంభి + ఇంద్ర = గజరాజు / ఐరావతం (కుంభీనామ్ ఇంద్రః), కృత్తిధర = శివుడు (మృత్యుంజయః కృత్తివాసాః – అమరకోశః–స్వర్గ31), జంభ + అరి = ఇంద్రుడు (జంభస్య అరిః / జంభః అరిః యస్య సః), షట్ + ముఖ = కుమారస్వామి (షట్ముఖాని యస్య సః) యొక్క; ముఖ + అంభోరుహ = ముఖపద్మాలచే, అభినుత = ప్రస్తుతింపబడినవాడా!, నృ–హరే = నృసింహా!, కృపయా = కరుణతో, మామ్ = నన్ను, పాహి = కాపాడుము (పా రక్షణే పరస్మైపది– ధాతువుపై లోట్ మధ్యమపురుషైకవచనం).

**తాత్పర్యము :** వజ్రాయుధం వంటి పదునైన గోళ్ళతో ఇంద్రశత్రువయిన హిరణ్యకశిపుడనే గజరాజును సంహరించిన వాడవు నీవు. కంబంనుండి పుట్టిన శిశువువు. పసివానికి వరాలిచ్చి కాపాడినవాడవు. గంభీరమైన నాదం కలవాడవు. లక్ష్మిని అనుసరించేవాడవు. బ్రహ్మ, వాయువు, ఆదిశేషుడు, గరుత్మంతుడు, ఐరావతం, శివుడు, ఇంద్రుడు, కార్తికేయుడు – వారి ముఖపద్మాలచే ప్రస్తుతింపబడేవాడవు. నరహరీ! దయతో నన్ను కాపాడు.

**విశేషాలు :**

**ఇంద్రరిపు కుంభీంద్ర :** ఇంద్రశత్రువయిన హిరణ్యకశిపుడనే గజరాజు. తాను నృసింహుడు కాబట్టి హిరణ్యకశిపునిలో కుంభీంద్రత్వారోపణం రమణీయం, ఔచిత్యశోభితం. గజసింహాలకు సహజశత్రుత్వముంటుంది. కానీ నారాయణునికి (పరమాత్మకు) నిసర్గశత్రుత్వ మెవ్వరితోనూ లేదుగదా! నిజమే కానీ భక్తులను ఇబ్బంది పెట్టేవారు భగవంతునికి శత్రువులు. కాబట్టి ఈ శత్రుత్వం కారణజాతం.

హిరణ్యకశిపునిలో గజరాజత్వాన్ని ఆరోపించటంద్వారా ఇది రూపకాలంకార మయినది. గజరాజును చంపటం నృసింహుని ఉద్దేశం కాదు. కాబట్టి ఆ ఉపమానం ఉపమేయంగా పరిణమించి క్రియతో అన్వయిస్తుంది. కాబట్టి ఇది పరిణామాలంకారం. "పరిణామః క్రియార్థశ్చేద్విషయీ విషయాత్మనా" (కువలయానందం–21).

నాలుగవ పాదంలో **'ముఖాంభోరుహనుత'** అన్నచోట కూడా పరిణామమే. అంభోరుహాలకు (తామరలకు) స్తోత్రం చేయగల శక్తి లేదు కాబట్టి ముఖాలుగా పరిణమించి క్రియతో అన్వయిస్తాయి.

**స్తంభార్భక –** దేవతలు త్రిదశులు. వారు పుట్టుకతోనే 30 సంవత్సరాలుగా కనిపిస్తారు. అయినా మన లెక్కలో స్తంభంనుండి అప్పుడే పుట్టినవాడు కాబట్టి ఆయన స్తంభార్భకుడు.

**డింభాయ దత్తవర –** పసివానికి వరాల నిచ్చినవాడు. డింభ శబ్దానికి మూఢుడని అర్థం. ఆ శబ్దశక్తిచే మూఢునకు వరాలనిచ్చేవాడు అని కూడా అర్థం ధ్వనిస్తుంది. నిజానికి వరాలు అవసరం పసివారికి, మూఢులకు మాత్రమే. జ్ఞానికి వాటి అవసరం లేదు. అవసరపడిందనుకొంటే జ్ఞానిత్వానికి తూటు పడినట్లే.

**అంభోధిజానుసరణ –** నారాయణుడు లక్ష్మిననుసరించియే వుంటాడు. శ్రీగుణరత్నకోశంలో పరాశరభట్టరు భావం గమనించండి –

యద్భ్రూభంగాః ప్రమాణం స్థిరచరరచనాతారతమ్యే మురారేః
వేదాంతాస్తత్త్వచింతాం మురభిదురసి యత్పాదచిహ్నైస్తరన్తి ।
భోగోపోద్ఘాతకేళీచుళుకితభగవద్వైశ్వరూపానుభావా
సా నః శ్రీరాస్తృణీతామమృతలహరిధీలంఘనీయైరపాంగైః ॥

– శ్రీగుణరత్నకోశం–4

చరాచర ప్రపంచ రచనా తారతమ్య ప్రదర్శనలో నారాయణునికి లక్ష్మి కడకంటి చూపులే ప్రమాణమట. ఆమె చెప్పనక్కరలేదు చూపులతోనే శాసించగలదు.

**కుంభీంద్ర –** ఐరావతం దిగ్గజాలకు ప్రతినిధి. వాటి తరపున స్తోత్రం చేయటం. దిగ్గజాలు ఎనిమిది.

ఐరావతః పుండరీకో వామనః కుముదోంజనః ॥
పుష్పదంతస్సార్వభౌమః సుప్రతీకశ్చ దిగ్గజాః ॥

– అమరకోశం – దిగ్వర్గ–3, 4

వాదిరాజతీర్థరు నృసింహుని ప్రకృతం స్తుతిస్తే, నృసింహుని గోళ్ళను స్తుతిస్తూ రెండు శ్లోకాలను అద్భుతంగా వ్రాసియున్నారు. నఖాలు (గోళ్ళు) సంహారంలో ప్రధానాయుధాలు కాబట్టి వారి వర్ణన కూడా ప్రకృతి స్తుతికన్న పదునుగా కనిపిస్తుంది పాఠకులకు, చూడండి –

పాన్త్వస్మాన్ పురుహూతవైరిబలవన్మాతంగమాద్యద్ఘటా–
కుమ్భోచ్చాద్రివిపాటనాధికపటుప్రత్యేకవజ్రాయితాః ।
శ్రీమత్కంఠీరవాస్యప్రతతసునఖరా దారితారాతిదూర–
ప్రధ్వస్తధ్వాన్తశాన్తప్రవితతమనసా భావితా భూరిభాగ్యైః ॥

లక్ష్మీకాన్త! సమంతతోఽపి కలయన్ నైవేశితుస్తే సమం
పశ్యామ్యుత్తమవస్తు దూరతరతోఽపాస్తం రసో యోఽష్టమః ।
యద్రోషోత్కరదక్షనేత్రకుటిలప్రాన్తోత్థితాగ్నిస్ఫురత్–
ఖద్యోతోపమవిస్ఫులింగభసితా బ్రహ్మేశశక్రోత్కరాః ॥

నృసింహావతారం సగం మనిషిగా – అంతకు ముందు అవతారాలు తిర్యగ్రూపాలు – మనుషులకు దగ్గరయినందువలన మిగిలినవాటికన్నా నృసింహావతారానికి వ్యాప్తి ఎక్కువ. ఆ పేర దేవాలయాలూ, సాహిత్యం లెక్కకు మిక్కిలిగానే విరాజిల్లుతున్నాయి.

లక్ష్మి దృష్టిలో పడిన నృసింహుని రూపాన్ని పోతన ఎలా వర్ణించారో గమనించండి-

ప్రళయార్క బింబంబు పగిదినున్నది గాని
నెమ్మోము పూర్వేందు నిభము గాదు
శిఖిశిఖా సంఘంబు చెలువు సూపెడుఁగాని
చూడ్కి ప్రసాదభాసురము గాదు
వీరరౌద్రాద్భుతావేశ మొప్పెడుఁగాని
భూరి కృపారస స్ఫూర్తిగాదు
భయదదంష్ట్రాంకురప్రభల గప్పెడుఁగాని
దరహసితాంబుజాతంబు గాదు

కఠినకర నారసింహ విగ్రహము గాని
కామినీజన సులభ విగ్రహము గాదు
విన్నదియుఁ గాదు తొల్లినే విష్ణువలనఁ
గన్నదియుఁగాదు భీషణాకారమనుచు – పోతన భాగవతం-7/342

ఇంత భీషణాకారం లక్ష్మికి అపరిచితం. అందుకే ఆమెకూడా సమీపించలేక పోయింది. చివరకు ప్రహ్లాదుడే నృసింహుని శాంతింపజేస్తాడు. నారాయణుని భక్తపరాధీనత నృసింహావతారంలో స్పష్టంగా కనిపిస్తుంది.



**శ్లో॥ పింగాక్షవిక్రమతురంగాదిసైన్యచతురంగావలిప్తదనుజా-**
**సాంగాధ్వరస్థబలిసాంగావపాతహృషితాంగామరాలినుత! తే ।**
**శృంగారపాదనఖతుంగాగ్రభిన్నకనకాంగాండపత్తితటినీ-**
**తుంగాతిమంగలతరంగాభిభూతభజకాంగాఘ! వామన! నమః ॥ 9**

**అవతారిక :** అదితి వేదనను పరిహరించటానికీ, బలిని అణచివేయటానికీ అవతరించిన విష్ణుమూర్తి వామన స్వరూప స్తుతి.

**అన్వయక్రమం :** పింగాక్ష విక్రమ తురంగ + ఆదిసైన్యచతుః + అంగ + అవలిప్త దనుజ + అసాంగ + అధ్వరస్థ బలి సాంగ + అవపాత హృషిత + అంగ!; అమర + ఆలి నుత!, శృంగార పాద నఖ తుంగ + అగ్ర భిన్న కనక + అంగ + అండ పత్తి తటినీ తుంగ + అతి మంగల తరంగ + అభిభూత భజక + అంగ + అఘ! వామన! తే నమః

**ప్రతిపదార్థము :** పింగా....తాంగ : పింగ + అక్ష = (పచ్చని కన్నులుగల) సింహంయొక్క (పింగే అక్షిణీ యస్య సః) ఇక్కడ అక్ష పదం దృష్టికి ఉపలక్షకం. 'కంఠీరవో గజరిపుః పింగదృష్టిః మృగాధిపః' (అమరకోశః-సింహాది-1); విక్రమ = పరాక్రమం వంటి పరాక్రమం గల (పింగాక్షస్య విక్రమః ఇవ విక్రమః యస్య సః); తురంగ + ఆది = గుర్రం మొదలుగా గల; సైన్య = సేనలనెడు; చతుః +

అంగ = నాల్గు రకాలైన బలాలతో (ఆశ్వికబలం, గజబలం, రథబలం, పదాతిబలం – ఈ నాల్గువిధాల సేనలు చతురంగబలాలు); అవలిప్త = పొగరుపడుతున్న (దర్పో మదోऽవలేపో – హలాయుధకోశః – 322); దనుజ = రాక్షసులయొక్క; అసాంగ = సాంగంగా లేని / సర్వాంగాలూ ఇమడని; అధ్వర + స్థ = యాగదీక్షలో నున్న (అధ్వరే తిష్ఠతి ఇతి అధ్వరస్థః); బలి = బలిచక్రవర్తియొక్క; స + అంగ = పరిపూర్ణంగా; అవపాత = అణగద్రొక్కుటకై (పాతాళం వరకు); హృషిత = పెంపొందింప జేయబడిన (హృష్ ధాతువుపై క్త ప్రత్యయం); అంగ = శరీరం గలవాడా!; అమర + ఆలి – నుత = దేవతల సమూహంచే కీర్తింపబడినవాడా!; శృంగార.... గాఘ : శృంగార = అందమయిన (శబ్దార్థకల్పతరుః పుట 1434); పాద = కాలియొక్క; నఖ = గోళ్ళయొక్క; తుంగ = ఉన్నతమయిన; అగ్ర = కొనలచే; భిన్న = బ్రద్దలు చేయబడిన (భిద్ ధాతువుపై క్త ప్రత్యయం – ధాతువులోని నకారానికి ప్రత్యయమైన తకారానికీ కూడా నత్వా దేశం. 'రదాభ్యాం నిష్ఠతో నః పూర్వస్య చ దః (అష్టాధ్యాయి – 8–2–42)); కనక + అంగ + అండ = బ్రహ్మాండంనుండి (కనక + అంగ = అంగశబ్దం గర్భోపలక్షకమై హిరణ్యగర్భ – సబ్రహ్మ అని అర్థాన్నిస్తుంది); పత్తి = (క్రిందికు) దొర్లిన (పద్ ధాతువుపై క్తిన్ ప్రత్యయం); తటినీ = ఆకాశగంగయొక్క; తుంగ = ఉన్నతమైన; అతిమంగల = పరమపవిత్రమైన; తరంగ = అలలచే; అభిభూత = ఎదుర్కొనబడిన (నశింపజేయబడిన); భజక = భక్తులయొక్క; అంగ = శరీరాలయందలి; అఘ! = పాపం గలవాడా! (పాపం కాయిక, వాచిక, మానసికాలుగా మూడు విధాలుగా వుంటుంది కాబట్టి సర్వసమాహారకంగా 'అంగ' పదప్రయోగం); వామన! = వామన స్వరూపా; తే = నీకు (ఇది చతుర్థీవిభక్తి. **'నమః స్వస్తిస్వాహాస్వధాలం వషడ్యోగాచ్చ'** (అష్టాధ్యాయి 2–3–16) సూత్రాన్ని బట్టి నమః శబ్ద సంయోగంతో చతుర్థీవిభక్తి ప్రయోగం); నమః = నమస్కారం.

**తాత్పర్యము :** దనుజుల దగ్గర చతురంగబలాలతో కూడిన సైన్యముంది. అది సింహ పరాక్రమం గల సేన. దాని ఉనికి రాక్షసులకు గర్వాన్ని కలిగిస్తోంది. ఆ గర్వంతోనే సర్వాంగీణంగా లేని రీతిలో యాగాన్ని ఆరంభించాడు బలిచక్రవర్తి. దాని ఫలితంగా వామనునిచే అణగద్రొక్కబడ్డాడు. ఆ అణచివేతకై తన శరీరాన్ని పెంపొందింపజేశాడు వామనుడు. అది దేవతల ప్రశంసలకు కారణమైంది.

వామనుడు రెండవపాదంతో ఆకాశాన్ని ఆక్రమిస్తున్నప్పుడు ఆయన అందమైన కాలి గోళ్ళు బ్రహ్మాండాన్ని బ్రద్దలు చేశాయి. అప్పుడు ఆకాశగంగ ఆ బీటలనుండి ఇహలోకానికి జాలువారింది. దాని ఉన్నత తరంగాలు భక్తుల బాహ్యాంతర పాపాలను పోగొడుతున్నాయి. అటువంటి వామనమూర్తీ నీకు నమస్కారం.

**విశేషాలు :**

**అసాంగ + అధ్వరం :** బలిచక్రవర్తి నిర్వహిస్తున్న యాగం సర్వాంగపరిపూర్ణం కాకపోవుట యేమిటి? ఏం అంశం లోపించింది? దీనికి సమాధానం శుక్రుడే నారాయణునకే వివరిస్తున్న వైనాన్ని గమనించండి.

శుక్రునితో నారాయణుడు –

"ఏమి గొఱంత వడియె నీతని యాగంబు
విస్తరింపు కడమ విప్రవర్య
విషమమైన కర్మవిసరంబు బ్రాహ్మణ
జనులు సూచినంత సమతఁ బొందు.

అనిన శుక్రుండిట్లనియె

అఖిలకర్మంబుల కధినాథుడవు నీవు – యజ్ఞేశుఁడవు నీవు యజ్ఞపురుష
ప్రత్యక్షమున నీవు పరితుష్టినొందినఁ – గడమేలగల్గునే కర్మములకు
ధనదేశకాలార్హతంత్రమంత్రంబుల – కొఱంతలు నిన్నుఁ బేర్కొనినమాను
నైనఁగావింతు నీ యానతి భవదాజ్ఞ – మెలఁగుట జనులకు మేలుగాదె

యింతకంటెను శుభము నాకెచటఁ గలుగు
ననుచు హరిపంపు శిరమున నావహించి
కావ్యుఁడమరేంద్రు జన్నంబు కడమఁదీర్చె
మునులు విప్రులు సాహాయ్యమునఁజరింప." – పోతన భాగవతము 8/676 – 678

విష్ణుర్వై యజ్ఞస్య దురిష్టం పాతి – ఐతరేయబ్రాహ్మణం –3/38/715

తద్వైవైతద్యజమానో విష్ణుర్భూత్వేమాన్
లోకాన్ క్రమతే స యః స విష్ణుః యజ్ఞః సః – శతపథబ్రాహ్మణం 6/7/2/10–11

ఈ రీతిగా వైదికప్రక్రియ విష్ణువునే యజ్ఞస్వరూపునిగా భావిస్తుంటే విష్ణువును వ్యతిరేకిస్తూ యాగనిర్వహణకు పూనుకోవటం దాన్ని అసమగ్రం చేసింది.

**ఆకాశగంగ పుట్టుక :** 'బ్రహ్మ కడిగిన పాదము' అంటూ అన్నమాచార్యులు సంకీర్తన చేసిన పాదమీ వామనునిదే. రెండవ అడుగుగా ఆకాశమంతా ఆక్రమిస్తున్నప్పుడు 'బ్రహ్మాండాంతసంవర్ధియై'న ఆ పాదాన్ని బ్రహ్మదేవుడు సమర్చించాడు. ఆ అర్ఘ్యజలమే గగనగంగగా అవతరించింది. భాగవతం ఎలా వివరించిందో చూడండి–

అథాంఘ్రయే ప్రోన్నమితాయ విష్ణో
**రుపాహరత్ పద్మభవోఽర్హణోదకమ్ ।**
సమర్చ్య భక్త్యాఽభ్యగృణాచ్ఛుచిశ్రవా
యన్నాభిపంకేరుహసంభవః స్వయమ్ ॥

**ధాతుః కమండలు జలం** తదురుక్రమస్య
పాదావనేజనపవిత్రతయా నరేంద్ర!
స్వర్ధున్యభూన్నభసి సా పతితా నిమార్ష్టి
లోకత్రయం భగవతో విశదేవ కీర్తిః ॥ – భాగవతం 8/21/3,4

తన పుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభిపంకేరుహం
బు నిరీక్షించి నటించి యున్నతపదంబుంజూచి తత్పాదసే
చనముంజేసె గమండలూదకములం జల్లించి తత్తోయముల్
వినువీథింబ్రవహించె దేవనది నా విశ్వాత్ము కీర్తిప్రభన్

– పోతనభాగవతం 8/628

**అలంకారం :** బ్రహ్మాండం వరకు వ్యాపించిన ఆ పాదాన్ని బ్రహ్మ తన కమండలు జలంతో అభిషేకిస్తే ఏర్పడినది గగనగంగ. అయితే వామనుని 'కాలిగోళ్ళచేత భిన్నమైన బ్రహ్మాండంనుండి గగనగంగ పుట్టిం'దని కవి ప్రకటించటం అతిశయోక్త్యలంకారం. లేని సంబంధాన్ని కవి కల్పించటం సంబంధాతిశయోక్త్యలంకారం. **'సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్'** (కువలయానందం–39)



**శ్లో॥ ధ్యానార్హవామనతనో! నాథ! పాహి యజమానాసురేశవసుధా-**
**దానాయ యాచనిక! లీనార్థవాగ్వశితనానాసదస్యదనుజ! ।**
**మీనాంకనిర్మలనిశానాథకోటిలసమానాత్మ! మౌంజిగుణకౌ-**
**పీనాచ్ఛసూత్రపదయా (గా) నాతపత్రకరకానమ్య! దండవరభృత్! ॥ 10**

**అవతారిక :** వామనావతారవర్ణనమే – ఆయనను శరణు గోరుట.

**అన్వయక్రమం :** ధ్యాన + అర్హ వామన తనో! నాథ! యజమాన + అసుర + ఈశ వసుధా దానయ, యాచనిక! లీన + అర్థవాగ్ వశిత నానా సదస్య దనుజ! మీన + అంక నిర్మల నిశా నాథ కోటి లసమాన + ఆత్మ! మౌంజి గుణ కౌపీన + అచ్ఛసూత్ర పదయా (గా)న + ఆతపత్ర కరక + ఆనమ్య! దండవరభృత్! పాహి.

**ప్రతిపదార్థము :** ధ్యాన + అర్హ = ధ్యానానికి తగిన (ధ్యై–చింతాయామ్ ధాతువుపై 'ల్యుట్ చ' (అష్టాధ్యాయి–3–3–115) సూత్రంతో ల్యుట్ ప్రత్యయం, అనాదేశం); వామన – తనో = వామనస్వరూపా / అందమైన రూపం గలవాడా! (ఈ రెండింటికీ విడివిడిగా ధ్యానార్హ! వామనతనో! అని కూడా అర్థం చెప్పుకోవచ్చు. కానీ వామన శరీరానికి ధ్యానార్హత్వాన్ని విశేషణం చేయటమే సముచితం. కాకపోతే నారాయణుని ఏ స్వరూపం ధ్యానార్హం కాదు?); నాథ! = స్వామీ; యజమాన.... దానాయ : యజమాన = యాగం చేస్తున్న (యజ్ ధాతువుపై శానచ్ ప్రత్యయం); అసుర + ఈశ = రాక్షసరాజును; వసుధా = భూమియొక్క; దానాయ = దానం కోసం; యాచనిక = అర్థివైన వాడా!; లీన....దనుజ : లీన + అర్థ = గూఢమైన అర్థం గల; వాగ్ = మాటలచే; వశిత = లోగొనబడిన; నానా = వివిధస్థాయిలను చెందిన; సదస్య = సభ్యులుగల; దనుజ = రాక్షసుడు గలవాడా! (ఇక్కడ మాటలకు లొంగిపోయినవారు సభ్యులు కావచ్చు, బలియే కావచ్చు. అందరుండీ బలినీ, దానశీలతను నిరోధింపలేకపోయారని భావం. చేయవలసిన వేళ చేయలేకపోవటం వారి వైఫల్యం.); మీన + అంక = మదనునియొక్కయు (మదనో మన్మథో మారః ప్రద్యుమ్నో **మీనకేతనః** – అమరకోశః – స్వర్గ

–25); నిర్మల = నిష్కలంకుడైన; నిశా–నాథ = చంద్రునియొక్కయు; కోటి = సమూహం వలె; లసమాన = ప్రకాశిస్తున్న (లస్ ధాతువుపై శానచ్ ప్రత్యయం); ఆత్మ! = స్వరూపంగలవాడా! మౌంజి.... నమ్య = మౌంజి–గుణ = కటిసూత్రం (ముంజె గడ్డితో ముప్పేటగా వేయబడి బ్రాహ్మణుడు ఉపనయనాది కాలములయందు ధరించు నడికట్టు – ఆంధ్రశబ్దరత్నాకరము మూడవ సంపుటము – పుట 1546; కౌపీన = గోచి; అచ్ఛ–సూత్ర = నిర్మలమైన జేందెం; పద–యాన = కాలినడక (పదగాన పాఠంలో వేదసూక్తాలనూ పదపాఠంలో వల్లెవేయటం); ఆతపత్ర = గొడుగు (ఆతపాత్ త్రాయతే – ఎండనుండి కాపాడేది. ప్రస్తుతం వానల్లోనే దానిని వాడుతున్నాం ఎక్కువగా); కరక = కమండలం (కమండలే చ కరకః – అమరకోశం – నానార్థ – 6) వీటిచే ఒప్పారుతూ; ఆనమ్య = పూర్తిగా వంగి నమస్కరింపదగినవాడా!; దండవర – భృత్ = శ్రేష్ఠమైన దండాన్ని ధరించినవాడా!; (వామనతనో! = వామనస్వరూపా!); పాహి = రక్షించు (పా రక్షణే పరస్మైపది – ధాతువుపై లోట్ మధ్యమపురుషైకవచనం).

**తాత్పర్యము :** ధ్యానానికి తగిన వామన శరీరం గలవాడా! స్వామీ! నువ్వు యాగం చేస్తున్న అసురేశ్వరుని భూమిని యాచించడానికి వచ్చినవాడవు. రాక్షసరాజ సదస్సులో సభ్యులను మాటలతో వశం చేసికొన్నవాడవు. కోటి మన్మథుల అందం, కోటి చంద్రుల కాంతులతో వెలుగొందేవాడవు. కటి సూత్రం, కౌపీనం, జేందెం, గొడుగు, కమండలం గలిగి పాదచారివై దండధారివై అందరకు నమస్కరింపదగినవాడవు. నన్ను కాపాడు.

**విశేషాలు :**

**ధ్యానార్హ :** ధ్యానానికి తగిన వామనతనువు. వామనత్వానికి రెండువిధాలుగా అర్థం చెప్పవచ్చు. వామనత్వమస్య అస్తీతి వామనః, అంటే పొట్టిగా వున్నవాడు. రూపం సూక్ష్మమయ్యేకొద్దీ ధ్యానం సాంద్రమవుతుంది.

నాసాగ్రన్యస్తనయనః సంవృతాస్యః సునిశ్చలః ।
ధ్యాయీత మనసా దేవమురోవిష్టభ్య చాగ్రతః ॥

ముక్కుచివర చూపు నుంచాలి ధ్యానసమయంలో. ధ్యేయమూర్తి ఎంత సూక్ష్మమైతే అంతగా అనుకూలం ధ్యానానికి. అది బిందుస్థాయికి, ఆపై నిర్బిందుస్థితికి వెళ్ళటానికి ధ్యానానికి పరాకాష్ఠ. ఆ రీతిగా వామనత్వం ధ్యానార్హం. **వామం శరీరమ్ అస్య ఇతి వామనః** – అందమైన శరీరం గలవాడు అని రెండవ అర్థం. కన్ను చెదరని అందం ఏకాగ్రతకు ఆలవాలమవుతుంది. అందువల్ల ఆ కోణంలోనుండి వామన తనువు ధ్యానయోగ్య మవుతుంది.

ధ్యానమంటే ద్వైతసంప్రదాయం ప్రకారం 'అచంచలమైన చిత్తముతో సర్వేశ్వరుఁడగు శ్రీమన్నారాయణుని దివ్యమంగళవిగ్రహమును చింతించుట' (ఆంధ్ర శబ్దరత్నాకరము – రెండవసంపుటం – 487)

ఋగ్వేదంలోని పురుషసూక్తమ్ నారాయణుని విక్రమత్వాన్ని వర్ణిస్తుంది. కానీ వామనాది పదాలు లేకుండా.

**ఏతావానస్య మహిమా అతోజ్యాయాగ్శ్చపురుషః పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోఽస్యేహాభవాత్పునః తతో విష్వఙ్వ్యక్రామత్....**

– శతపథబ్రాహ్మణం త్రివిక్రమత్వాన్ని స్పష్టంగా వివరిస్తుంది.

**యజ్ఞో వై విష్ణుః స దేవేభ్య ఇమాం విక్రాంతిం విచక్రమే యేషామియం విక్రాంతిరిదమేవ ప్రథమేన పదేన పస్పారాథేదమంతరిక్షం ద్వితీయేన దివముత్తమే నైతామ్వేవైష ఏతస్మై విష్ణుర్యజ్ఞో విక్రాంతిం విక్రమతే.** – శతపథబ్రాహ్మణం 1-1-2-13.

**లసమాన :** లస్ ధాతువు పరస్మైపది. **'లటః శతృశానచావప్రథమాసమానాధికరణే'** (అష్టాధ్యాయి 3-2-124) సూత్రంతో శతృప్రత్యయమే రావాలి. కానీ ఇక్కడ శానచ్ ప్రత్యయ ప్రయోగముంది. ధాతువు ఆత్మనేపది అయితేనే శానచ్ ప్రవృత్తి. **'అకర్మకాచ్చ'** (అష్టాధ్యాయి 1-3-26) సూత్రంతో అకర్మకత్వం ద్వారా ఆత్మనేపదిత్వాన్ని సాధించవచ్చు ధాతువునకు. వస్తుతః శ్లేషణక్రీడార్థాలలో ఉపయోగించే లసధాతువును ప్రకాశార్థంలో వాడటం వలన దానికి ఆత్మనేపదిత్వం, తద్ద్వారా శానచ్ ప్రత్యయం కలుగవచ్చు.

ధాతోరర్థాంతరే వృత్తేః ధాత్వర్థేనోపసంగ్రహాత్ ।
ప్రసిద్ధేరవివక్షాతః కర్మణోఽకర్మికా క్రియా ॥

వామనావతారం ద్వారా మనం గ్రహించవలసిన ఆంతర్యమిది

"ఇచ్చేవాని చేయి పైని, పుచ్చుకొనేవాని చెయ్యి క్రిందనూ ఉంటుంది ఇచ్చేటప్పుడు. దాన్నిబట్టి దాతకు గౌరవమూ, గ్రహీతకు చులకనదనమూ సంక్రమిస్తాయి. అందుకే బలిచక్రవర్తి దగ్గరకు దానం కోసం వెడదామనుకొన్న విష్ణువునకు చిన్నతనం (వామనత్వం) సంక్రమించింది. ఇక్కడ మరొకటి కూడా గ్రహించాలి. ఉత్తములనుండి దానాన్ని గ్రహించితే ఆ ధనం పవిత్రమైనదైతే ప్రతిగ్రహీతను ఉన్నతుణ్ణి చేస్తుంది. అందుకే వామనత్వంతో వచ్చిన విష్ణుమూర్తి బలిచక్రవర్తి దానాన్ని గ్రహించి త్రివిక్రముడయ్యాడు. బ్రహ్మాండాంతసంవర్ధి యైనాడు."

– భారతనిరుక్తి – నన్నయరుచిరార్థసూక్తి. పు. 42



**శ్లో॥ ధైర్యామ్బుధే! పరశుచర్యాధికృత్తఖలవర్యావనీశ్వర! మహా-**
**శౌర్యాభిభూతకృతవీర్యాత్మజాతభుజవీర్యావలేపనికర ।**
**భార్యాపరాధకుపితార్యాజ్ఞయా గలితనార్యాత్మసూగళతరో!**
**కార్యాపరాధమవిచార్యార్యమౌఘజయివీర్యామితా మయి దయా॥ 11**

**అవతారిక :** పరశురాముని జీవితంలోని మూడు ప్రధాన సంఘటనలను ప్రస్తావిస్తూ స్తుతిస్తున్న శ్లోకమిది.

**అన్వయక్రమం :** ధైర్య + అమ్బుధే! పరశు – చర్యా + అధికృత్త – ఖలవర్య + అవనీశ్వర! మహాశౌర్య + అభిభూత – కృతవీర్య + ఆత్మ-జాత-భుజ-వీర్య + అవలేప – నికర! భార్యా +

అపరాధ – కృత + ఆర్య + అజ్ఞయా అపరాధమ్ అవిచార్య గలిత – నారీ + ఆత్మసూ – గళ – తరో! అర్యమ + ఓఘ – జయి – వీర్యా అమితా దయా మయి కార్యా.

**ప్రతిపదార్థము :** ధైర్య + అమ్బుధే : ధైర్య = ధైర్యమందు, అంబుధే = సముద్రంవంటి వాడా! (ధైర్యే అంబుధిః ఇవ తస్మాత్ సంబుద్ధిః); పరశు.....నీశ్వర : పరశు = గొడ్డలియొక్క (పరశ్వథః కుఠారః స్యాత్పరశుః – హలాయుధకోశః 474) పరాన్ శృణాతి ఇతి పరశుః), చర్యా = పనితనం చేత, అధికృత్త = నరకబడిన, ఖల – వర్య = చెడ్డవారిలో మేటులయిన, అవనీ + ఈశ్వర = రాజులు గలవాడా!, శౌర్య = పరాక్రమంతో (శూరస్య భావః శౌర్యమ్), అభిభూత = పీచమణచబడిన, కృతవీర్య + ఆత్మజాత = కృతవీర్యుని కుమారుని (కార్తవీర్యుని) యొక్క, భుజ = బాహువులయొక్క (వేయి బాహువులయొక్క), వీర్య = శక్తియొక్క, అవలేప = గర్వంయొక్క, నికర = సారంగలవాడా! (నికరః సారే – శబ్దార్థకల్పతరుః పుట 854); భార్యా....జ్ఞయా : భార్యా = భార్య అయిన రేణుకయొక్క, అపరాధ = నేరం చేత, కుపిత = కోపించిన, ఆర్య = తండ్రియొక్క, ఆజ్ఞయా = ఆదేశం చేత, అపరాధమ్ = నేరాన్ని గూర్చి, అవిచార్య = ఆలోచించకుండానే / విచారణ జరుపకుండానే; గలిత.... గళతరో : గలిత = నరకబడిన / జార్చబడిన, నారీ = నరధర్మాచారాలు గల స్త్రీ అయిన, ఆత్మసూ = తల్లియొక్క (ఆత్మా సూయత్ అస్యాః ఇతి), గళ = మెడ అనెడి, తరో = చెట్టు గలవాడా!; అర్యమ + ఓఘ – జయి – వీర్యా : అర్యమ = సూర్యులయొక్క, ఓఘ = సమూహాన్ని, జయి = గెలిచే, వీర్యా = పరాక్రమం గలవాడా! (వీరస్య భావః వీర్యమ్), అమితా = అవధి లేని, దయా = కరుణ, మయి = నాయందు, కార్యా = చేయదగినది. (కృ కరణే ధాతువుపై 'ఋహల్యోః ణ్యత్' అని ణ్యత్ప్రత్యయం – టాప్ – స్త్రీ ప్రత్యయం).

**తాత్పర్యము :** ధైర్యసాగరుడా! నీ పరశువు (గొడ్డలి) యొక్క చర్యతో చెడ్డవారుగా భావింపబడిన రాజుల నందరనూ సంహరించావు. నీ పరాక్రమంతో వేయిబాహువులు గల కార్తవీర్యుని భుజగర్వాసారాన్ని అణచివేశావు. తల్లి తప్పుచేసిందని కోపించిన తండ్రియొక్క ఆదేశంతో వాస్తవవిచారణ జరుపకుండానే ఆమె మెడ అనే చెట్టును నరికివేశావు. నామీద అంతులేని దయను చూపించు.

**విశేషాలు :** మొదటిపాదంలో పరశురాముడు క్షత్రియసంహారం చేసిన వైనం ప్రస్తావించబడింది. 'ఖలవర్య' అని మరీ చెడ్డరాజులను అంటూ వేరుచేసినట్లు కనిపిస్తున్నా మనకున్న కథల ప్రకారం పరశురాముడు ఆ విభాగాన్ని పాటించలేదు. కాబట్టి ఖలవర్య పదం క్షత్రియజాతికి మొత్తానికి అన్వయిస్తుందికూడ.

కార్తవీర్యుని కుమారులు తన తండ్రిని చంపినందుకు ప్రతీకారంగా వారిని చంపి అంతటితో ఆగక క్షత్రజాతిని నిర్మూలనం చేయటం పరశురాముని ఘనతగా భావింపబడుతోంది. పోతనకూడా భాగవతంలో –

అయ్య పగకు రాముఁడలయక రాజుల
నిరువదొక్కమాఱు లరసి చంపె
జగతి మీఁద రాజశబ్దంబు లేకుండ
సూడు దీర్పలేని సుతుఁడు సుతుఁడె. – నవమస్కంధం – 486

ప్రతీకారం తీర్చలేని కుమారుడు కుమారుడేనా? అని పోతన పితృపుత్ర సంబంధంయొక్క పరమార్థతను చూపించే ప్రయత్నం చేశాడు. కానీ దానిని సిద్ధాంతంగా పరశురాముని తండ్రి జమదగ్నియే అంగీకరించలేదు. తమ ఔన్నత్యానికి కారణం ప్రతీకారం కాదని వాచా ప్రకటించాడు.

జమదగ్ని ఆశ్రమంలోని హోమధేనువును కార్తవీర్యుడు తన భటులద్వారా దొంగిలించినందుకు కోపించిన పరశురాముడు కార్తవీర్యునిపై దాడిచేసి, చంపి, మరల హోమధేనువును ఆశ్రమానికి తెచ్చాడు. అప్పుడు జమదగ్ని పలికిన మాటలు – పోతన రచనలోనే...

కలవేల్పు లెల్లఁ దమతమ – చెలువంబులు దెచ్చి రాజుఁజేయుదురకటా
బలువేల్పురాజు వానిం – జలమున నిట్లేల పోయి చంపితి పుత్రా!

తాలిమి మనకును ధర్మము – తాలిమి మూలంబు ధర్మతత్త్వంబునకున్
దాలిమి గలదని ఈశుం – డేలించును బ్రహ్మపదమునెల్లన్ మనలన్.

క్షమ గలిగిన సిరిగలుగును
క్షమ గలిగిన వాణి గలులు సౌఖ్యములెల్లన్
క్షమ కలుగఁదోన కలుగును
క్షమ గలిగిన మెచ్చుశౌరి సదయుడు తండ్రీ! – భాగవతము 9/460-462

బ్రాహ్మణుల ఔన్నత్యానికి మూలం తాలిమి (సహనం) కాబట్టి ప్రతీకారం ద్వారా తత్సంబంధ ఫలాలు సమకూరినా మూలకారణమైన తాలిమి దెబ్బతింటోంది కాబట్టి అది తగదని పరశురాముని జనకుని అభిప్రాయం.

రెండవ పాదంలో సంఘటన కార్తవీర్య దౌష్ట్యానికీ, తత్ఫలానికీ సంబంధించినది. కార్తవీర్యుడు వేటలో అలసి జమదగ్ని ఆశ్రమానికి చేరగా అక్కడ ఆయన రాజునకూ, రాజ పరివారానికీ హోమధేనువు అనుగ్రహంతో విందు చేశాడు. అప్పుడు కార్తవీర్యుడు **'సంపదేటికి నీ యావు చాలుగాక'** అనుకొని దానిని అపహరించుకొని పోయాడు. దానితో కోపించిన పరశురాముడు (ఆ విషయం తెలిసిన తరువాత) కార్తవీర్యుని సంహరించి ఆవును తెచ్చాడు. దత్తాత్రేయ వరప్రభావం వలన కార్తవీర్యుడు సహస్రబాహువయినా పరశురాముని ముందు బలహీనుడే!

మూడవపాదంలోని సంఘటన గృహవ్యవహారం. జమదగ్ని భార్య రేణుకాదేవి నీటికై గంగకేగి అక్కడ జలక్రీడలాడుతున్న చిత్రరథుని 'కొంత ప్రేమతో' చూసిందట. ఆమె ఆలస్యంగా ఆశ్రమానికి రావటంలో కోపించిన జమదగ్ని ఆమెను సంహరించమని కొడుకులను ఆదేశించాడు. పరశురాముడొక్కడే అందుకు సిద్ధపడి ఆమెను, ఆమెను చంపటానికి నిరాకరించిన సోదరులను కూడా నరికివేశాడు.

పితృవాక్యపరిపాలన అంటే ప్రజలు రాముని గూర్చి ఆలోచిస్తారు కానీ పరశురాముడు అంతకంటే గొప్పగానే తండ్రి ఆదేశాన్ని పాటించాడుగదా! అంటే రాముని ప్రవర్తన ఆదర్శం కానీ పరశురాముని ప్రవర్తన ఆదర్శం కాదు. కారణం –

పడినవారి మరల బ్రతికింపనోపును
జనకుఁడనుచుఁ జంపె జమదగ్ఙ్యుఁ
డతఁడు సంపెననుచు నన్నలఁదల్లిని
**జనకు నాజ్ఞనైనఁ జంపఁదగదు.** – భాగవతము 9/475.

తండ్రి ఆజ్ఞ ముఖ్యమా? ఆదర్శం ముఖ్యమా? అన్న సంశయానిక తావే లేదు. ఆదర్శమే ముఖ్యం. అందుకే ప్రహ్లాదుడు తండ్రి మాటను తిరస్కరించినా ఆ కారణంగా ఆయనను నిందించకపోగా నెత్తిన బెట్టుకొని గౌరవిస్తున్నాం. తండ్రి మాటను బొత్తిగా కాదన్నవాడు ప్రహ్లాదుడు.

కాబట్టి పరశురాముని చర్య పరశురామునకే చెల్లింది. మనకది ఆదర్శం కాదు. తనకు మాత్రమే సాధ్యమైన అసాధారణ కార్యకారి కాబట్టియే పరశురామునివలన జమదగ్నికి సప్తర్షులలో స్థానం లభించింది.

ఆప్పుఁడగు పుత్రువలనను
బ్రాప్త తనుండగుచుఁ దపము బలిమిని మింటన్
సప్తర్షి మండలంబున
సప్తముఁడై వెలుగుచుండె జమదగ్ని నృపా! – భాగవతము 9/488

**పరశురాముడు చిరజీవి :** పరశురాముని చిరజీవులలో ఒకరుగా పరిగణిస్తారు.

అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః ।
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః ॥



శ్లో॥ **శ్రీరామ లక్ష్మణశుకారామభూరవతు గౌరామలామితమహో**
**హారామరస్తుతయశో రామకాంతిసుతనో! రామలబ్ధకలహా! ।**
**స్వారామవర్యరిపువీర్యామయర్ధికర! చీరామలావృతకటే!**
**స్వారామదర్శనజమారామయాగతసుఘోరామనోరథహర!॥** **12**

**అవతారిక :** శ్రీ రామావతారస్తుతిని ప్రారంభిస్తూ చెప్పిన మొదటి శ్లోకమిది.

**ప్రతిపదార్థము :** లక్ష్మణశుక+ఆరామభూః : లక్ష్మణ = లక్ష్మణుడు అనే, శుక = చిలుకకు, ఆరామ – భూః = ఉపవన (తోట) ప్రదేశమూ (ఆరామస్తథోపవనముచ్యతే – హలాయుధకోశః 212) (ఆరమ్యతే అత్ర ఇతి ఆరామః); గౌర + అమల + అమిత – మహః + హార : గౌర = తెల్లనై, అమల = నిర్మలమై, అమిత = ఎక్కువైన, మహః = కాంతిగల (కాంత్యుత్సవే తు మహసీ – నానార్థరత్నమాలా – పంక్తి – 1149), హార = ముత్యాలహారం గలవాడా!; అమర–స్తుత–యశః : అమర = దేవతలచే, స్తుత = పొగడబడిన, యశః = కీర్తిగలవాడా! యశస్స్వరూపుడా! (అమరైః స్తుతం యశః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః); రామ–కాంతి–సుతనో : రామ = అందమైన, కాంతి = కాంతి గల, సుతనో = మంచి శరీరం గలవాడా! (రామా చ అసౌ కాంతిః సా చ అసౌ సుతనుః

తస్మాత్ సంబుద్ధిః); రామ-లబ్ధ-కలహ : రామ = పరశురామునితో, లబ్ధ = ఏర్పడిన / కలిగిన, కలహ = గొడవ గలవాడా; స్వారామ ... కర : స్వః = స్వర్గమందు, రామ = రమించెడి దేవతలలో (స్వర్ + రామ-**రోరి** (అష్టాధ్యాయి 8-3-14) సూత్రంతో రేఫ లోపం. **ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః'** (అష్టాధ్యాయి 63-111) సూత్రంలో దీర్ఘం - స్వారామ), వర్య = శ్రేష్ఠుడైన ఇంద్రునియొక్క, రిపు = శత్రువులైన రాక్షసులయొక్క, వీర్య = శక్తియొక్క, ఆమయ = రోగాలను, ఋద్ధి-కర = వృద్ధిచేయువాడా! (వృద్ధిర్మోద సుఖర్ధిషు - నానార్థరత్నమాలా - పంక్తి 629); చీర + అమల + ఆవృత కటే : చీర = నారబట్టలచే, అమల = నిర్మలంగా, ఆవృత = చుట్టబడిన, కటే = నడుముభాగం కలవాడా!; స్వ + ఆరామ....హర : స్వ + ఆరామ = తన తోటలో లేదా సు + ఆరామ = మంచి తోటలో, దర్శనజ = చూచుటచేత పుట్టినట్టి, మార + ఆమయ = మదన రోగంతో, ఆగత = వచ్చినట్టి, సుఘోరా = పరమ భీకరమైన (ఘోరయతి భయానకరసనిమిత్తీ భవతి ఇతి ఘోరః) శూర్పణఖయొక్క, మనోరథ = కోరికను, హర = అపహరించినవాడా!, శ్రీరామ = శ్రీరామా!, అవతు = రక్షించు (అవ రక్షణే పరస్మైపది - లోట్ - ప్రథమపురుషైకవచనం)

**తాత్పర్యము :** లక్ష్మణుడనే చిలుకకు ఉపవనం వంటి వాడవు నీవు. అందమైన తెల్లని కాంతి గల ముత్యాలపేటలు ధరించేవాడవు. దేవతలచే స్తుతింపబడిన కీర్తి గలవాడవు. కాంతిమంతమైన చక్కని శరీరం గలవాడవు. పరశురామునితో కలహమేర్పడిన వాడవు. దేవేంద్రునకు శత్రువులయిన రాక్షసుల పరాక్రమానికి అస్వస్థతను పెంచేవాడవు. కటిపై నిర్మలమైన నారబట్టలు ధరించినవాడవు. తోటలో (పంచవటిలో) నిన్ను చూసి మదన సంబంధమైన అస్వస్థతకు గురియై నిన్ను సమీపించిన భీకరశరీర అయిన శూర్పణఖ మనోరథాన్ని అపహరించినవాడవు. శ్రీరామా! (నన్ను) కాపాడు.

**విశేషాలు : లక్ష్మణశుకారామభూః -** లక్ష్మణుడు ఆదిశేషస్వరూపుడు. అక్కడ పాలకడలిలో విష్ణువునకు ఆదిశేషుడు ఆరామభూమి. ఇక్కడ లక్ష్మణుడనే చిలుకకు శ్రీరాముడు ఆరామభూమి. ఆధారాధేయాల పరివర్తన. కానీ అక్కడ తిర్యక్త్వాన్ని ఇక్కడ కూడా అలాగే ఉంచారు కవి శుకరూపంగా.

శుకానికి ఆధారమైన తోట అనటం ద్వారా ఆ ఇద్దరి అవినాభావసంబంధం వ్యక్తమవుతుంది. వాల్మీకి ఆ బంధాన్ని సుస్పష్టంగా వివరించారు.

బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధనః ॥

రామస్య లోకరామస్య భ్రాతుర్జ్యేష్ఠస్య నిత్యశః ।
సర్వప్రియకరస్తస్య రామస్యాపి శరీరతః ॥

లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిఃప్రాణ ఇవాపరః ।
న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః ॥

- రామాయణం బాలకాండమ్ - 18/28-30

లక్ష్మణుడు ఆదిశేషుడు. పాలకడలిలో శయ్య. మరి లక్ష్మణుడు లేకుంటే నిద్ర ఎలా పడుతుంది?

**అమరస్తుతయశః –** దేవతలచే స్తుతింపబడిన యశస్స్వరూపుడు. 'సామవేద ఏవ యశః' (గోపథబ్రాహ్మణమ్. పూ. 5/15) యశస్సంటే సామవేదమే. బ్రాహ్మణగ్రంథాలు యశశ్శబ్దానికి వివిధ వివరణల నిచ్చాయి. రామాయణం వేదస్వరూపమని వాల్మీకి వక్కణ.

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।
వేదః ప్రాచేతసాదాసీస్సాక్షాద్రామయణాత్మనా ॥

**రామలబ్ధకలహ –** పరశురాముని ద్వారా లభించిన కలహం గలవాడా! సహజంగా రామకథలో తాను సంకల్పించి చేసిన సంఘటనలు దాదాపు కనిపించవు. పరశురామ విషయంలో అది మరీ విచిత్రం. ఎటునుండీ, ఎందుకు, ఎలా వచ్చిందో తెలియని కలహం. శివధనుస్సు జనకుని దగ్గర వుంటే వైష్ణవధనుస్సు పరశురాముని దగ్గరుండటమొక్కటే అక్కడ కారణం. జనకుడు రాజర్షి కాబట్టి శివధనుస్సు ఆయన దగ్గరున్నా, విరిగినా ఉపద్రవాలేవీ లేవు. కానీ వైష్ణవధనుస్సును పట్టిన పరశురాముడు జనకునిలా రాజర్షీ కాదు, వసిష్ఠునిలా బ్రహ్మర్షీ కాదు. అందుకే చిక్కులు.

**చీరామలావృతకటే –** చీర శబ్దం ఆధునిక కాలంలో స్త్రీలు ధరించే వస్త్రంగా అర్థ సంకోచాన్ని పొందింది. భాషలో అర్థపరిణామం సహజం. కానీ ఒకప్పుడు చీర అంటే స్త్రీ పురుష లెవరైనా ధరించే వస్త్రం. లేదా చెట్ల బెరడు లేదా నారబట్టలు. ఏవైనా లింగసంబంధ నియమమేమీ లేదు.

చేలం చీరం వాసః కర్పటమాచ్ఛాదనం నివసనం చ ।
అంబరమంశుకముక్తం వస్త్రం నిచయః పటః పోటః ॥
చతుర్విధం తు విజ్ఞేయం త్వక్ సూత్ర కృమి రోమజమ్ ॥

రామాయణంలో చెట్ల బెరడును ధరించినట్లు (లక్ష్మణుడు) వాచా కనిపిస్తుంది.

ప్రాగేవ తు మహాబుద్ధిః సౌమిత్రిర్భ్రాతృవత్సలః ।
పూర్వజస్యానుయాత్రార్థం ద్రుమచీరైరలంకృతః ॥
– రామాయణం 5-31-22 (హలాయుధకోశం నుండి)

మార + ఆమయ + ఆగతసుఘోరా – శూర్పణఖ అంత ఘోరంగా కనిపించటానికి కారణం ఆమె రూపంతో పాటు వివిధ లక్షణాలు కారణమవుతాయి. వాల్మీకి శూర్పణఖ ప్రవేశించినప్పుడు రాముడికీ, శూర్పణఖకూ ఉన్న భేదాన్ని తెలియజేస్తూ కథ నడిపిస్తాడు.

బభూవేంద్రోపమం దృష్ట్వా రాక్షసీ కామమోహితా ।
సుముఖం దుర్ముఖీ రామం వృత్తమధ్యం మహోదరీ ॥

విశాలాక్షం విరూపాక్షీ సుకేశం తామ్రమూర్ధజా ।
ప్రియరూపం విరూపా సా సుస్వరం భైరవస్వనా ॥

తరుణం దారుణా వృద్ధా దక్షిణం వామభాషిణీ ।
న్యాయవృత్తం సుదుర్వృత్తా ప్రియమప్రియదర్శనమ్ ॥
శరీరజ సమావిష్టా రాక్షసీ రామమబ్రవీత్ ॥ – అరణ్యకాండమ్ 17/9-12

శరీరజ మంటే కామం. కామావిష్టయై శూర్పణఖ రామునితో మాటాడింది. కామం అధర్మం కాదు. ధర్మాహీనమైతే తప్పు.

ధర్మవిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥ – భగవద్గీత 7/11

శూర్పణఖ కోరిక ధర్మమా? అధర్మమా? అన్న చర్చ మరొకప్పుడు.



**శ్లో॥ శ్రీకేశవ ప్రదిశ నాకేశజాతకపిలోకేశభగ్నరవిభూ-**
**స్తోకేతరార్తిహరణాకేవలార్తసుఖధీకేకికాలజలద! ।**
**సాకేతనాథవరపాకేరముఖ్యసుతకోకేన! భక్తిమతులాం**
**రాకేన్దుబింబముఖ! కాకేక్షణాపహ! హృషీకేశ తేఽఙ్ఘ్రికమలే ॥ 13**

**అవతారిక :** శ్రీ రామావతారస్తుతిలో తరువాతి శ్లోకం.

**అన్వయక్రమం :** నాక+ఈశ-జాత-కపి-లోక+ ఈశ-భగ్న-రవి-భూ-స్తోక+ఇతర+ ఆర్తి-హరణ! ఆకేవల+ఆర్త-సుఖ-ధీ-కేకి-కాల-జలద! సాకేత-నాథ-వర-పాక-ఈర- ముఖ్య-సుత-కోక-ఇన! రాకా+ఇన్దు-బింబ-ముఖ! కాక+ఈక్షణ+అపహ! హృషీక+ ఈశ! శ్రీకేశవ! తే అంఘ్రికమలే అతులాం భక్తిం ప్రదిశ.

**ప్రతిపదార్థం :** నాకేశ ...... హరణ : నాక + ఈశ = ఇంద్రునివలన (స్వరవ్యయం స్వర్గనాకః – అమరకోశః – స్వర్గ – 6), జాత = పుట్టినట్టి (జనీ ప్రాదుర్భావే ధాతువుపై క్త ప్రత్యయం), కపి – లోక + ఈశ = కోతులగుంపుకు నాయకుడైన వాలిచేత, భగ్న = భంగపడిన, రవి-భూ = సూర్యసుతుడైన సుగ్రీవునియొక్క, స్తోక + ఇతర = మిక్కుటమైన (తలినం విరళే స్తోకే – నానార్థమంజరి – పంక్తి 991), ఆర్తి = ఆవేదనను, హరణ! = తొలగించినవాడా!; ఆకేవ.... జలద! = ఆకేవల = కేవలుని (బ్రహ్మ / బ్రహ్మజ్ఞానం) గురించియే, ఆర్త=ఆర్తి గలవారియొక్క, సుఖ-ధీ = అనుకూలబుద్ధి అనే (సర్వేషామనుకూలతయా వేదనీయం సుఖమ్ – తర్కసంగ్రహః), కేకి = నెమళ్ళకు, కాల-జలద! = కాలమేఘంవంటివాడా; సాకేత ..... పాక = సాకేత – నాథ = అయోధ్యా నగరానికి ప్రభువైన దశరథునియొక్క (అకేతేన సహవర్తత ఇతి సాకేతః – సుఖంగా నివసింపదగిన నగరం – అయోధ్య అనే అర్థంలో రూఢం), వర = శ్రేష్ఠమైన, పాక = సంతానమా! (పాకోజరసునిష్ఠయోః అర్భకే పచనేఽపి నానార్థమంజరి పంక్తి 62,63); ఈర ..... కోకేన = ఈర = వాయుదేవునియొక్క, ముఖ్య-సుత = ప్రధానకుమారుడైన ఆంజనేయుడు అనే, కోక = చక్రవాకపక్షికి (కోకశ్చక్రశ్చక్రవాకః – హలాయుధకోశః 2-44), ఇన = సూర్యుని వంటివాడా!; రాకేన్దు .... ముఖ! = రాకా+ఇన్దు-బింబ = పున్నమి చంద్రబింబం వంటి, ముఖ! = మోముగలవాడా!; కాక + ఈక్షణ + అపహ! : కాక = కాకాసురునియొక్క, ఈక్షణ = చూపును, అపహ! = కొల్లగొట్టిన వాడా!; హృషీక+ఈశ! : హృషీక = ఇంద్రియాలకు (ఖమక్షమింద్రియం స్రోతః హృషీకం – హలాయుధకోశః 535); ఈశ = ప్రభువైనవాడా! (హృషీకాణా మీశః = హృషీకేశః), శ్రీకేశవ! = లక్ష్మీనారాయణ స్వరూపా!, తే = నీయొక్క, అంఘ్రికమలే = పాదపద్మంపై, అతులామ్ = సాటిలేని, భక్తిమ్ = భక్తిని, ప్రదిశ = అందించు (ప్ర + దిశ అతిసర్జనే – పరస్మైపది – లోట్ – మ.ఏ.)

**తాత్పర్యం :** లక్ష్మీనారాయణ స్వరూపా! రామా! ఇంద్రకుమారుడైన వాలివలన కలత పడుతున్న సుగ్రీవుని (సూర్యకుమారుని) ఆవేదనను పోగొట్టిన వాడవు నీవు. బ్రహ్మజ్ఞానం ద్వారా సుఖాన్ని పొందాలనుకొనే ఆలోచన గల వారు నెమళ్ళయితే వారి పురి విప్పి నాట్యం చేయించే కాలమేఘానివి నీవు, దశరథుని సంతానంలో మేటివి. వాయుదేవుని ముఖ్య కుమారుడైన ఆంజనేయుడనే చక్రవాకానికి సూర్యుని వంటివాడవు నీవు. పూర్ణచంద్ర బింబం వంటి మోము గలవాడవు. కాకాసురుని కంటిని అపహరించినవాడవు. ఇంద్రియ విజేతవు. నీ పాదకమలాలపై నాకు సాటిలేని భక్తిని కలిగించు.

**విశేషాలు :** అవతార ప్రయోజనాలు తాను భావించిన దుష్టశిక్షణ, శిష్టరక్షణ. తద్వారా ధర్మసంరక్షణం. ఆ క్రమంలో ఆత్మీయతలూ, బాంధవ్యాలు, పూర్వ పరిచయాలూ ఏవీ పరిగణనలోనికి రావు. ఒక అవతారంలో చేసిన పనికి విరుద్ధమైన పనిని కూడా మరొక అవతారంలో చేస్తుంటారు –

దివిజేంద్రసుతునిఁ జంపియు
రవిసుతు రక్షించినావు రఘురాముడవై
దివిజేంద్రసుతుని గాచియు
రవిసుతుఁ బరిమార్చితీవు రణమున కృష్ణా!

ఒకసారి వాలిని చంపి సుగ్రీవుని కాపాడటం. మరోసారి అర్జునుని కాపాడి కర్ణుని చంపటం –

వాలి సుగ్రీవులు అన్నదమ్ములు. వారికి తల్లి ఒకరే. అరుణి. సూర్య రథసారథి అయిన అరుణుడు స్త్రీ రూపాన్ని ధరించి, అరుణి అయినప్పుడు పుట్టినవారు వారు. అరుణికి ఇంద్రుడిద్వారా పుట్టినవాడు వాలి. సూర్యుని ద్వారా పుట్టినవాడు సుగ్రీవుడు. అహల్య పోషణలో వున్న ఆ ఇద్దరూ గౌతముని శాపంవల్ల వానరులయ్యారు. ఇంద్రుడు ఆ ఇద్దరినీ కవిరాజైన ఋక్షరాజు దగ్గరకు చేర్చాడు. అప్పటికి ఋక్షరాజుకు సంతతి లేదు. ఆ ఇద్దరినీ కుమారులుగా స్వీకరించాడు.

2. చక్రవాకపక్షులకు రేయంతా వియోగకాలం. సూర్యోదయం వాటికి ఆనందకరం.

త్యజ చక్రవాకి శోకం బధాన ధైర్యం సహస్వ సమయమముమ్ ।
జయమేవ వాసర మణిర్ధారిష్యతే శాపమూర్చాం తే ॥

అని చక్రవాకిని ఊరడించటం కూడా కవుల వర్ణనల్లో కనిపిస్తుంది. ఆంజనేయుడనే చక్రవాకపక్షికి సూర్యునివంటివాడు శ్రీరాముడు.

3. కాకాసురుని ఒక కంటిని అపహరించినవాడు శ్రీరాముడు. ఆ విషయం రామాయణంలోని సుందరకాండలో 37వ సర్గలో సీత హనుమంతునకు వినిపిస్తుంది. రామునకు ప్రత్యభిజ్ఞానంగా ఇంద్రుని కుమారుడు జయంతుడు కాకరూపాన్ని ధరించి వచ్చి చేసిన దుశ్చేష్ట, దాని ఫలితం ఆ సన్నివేశంలో వర్ణింపబడింది.

పుత్త్రః కిల స శక్రస్య వాయసః పతతాం వరః ।
ధరాంతరగతః శీఘ్రం పవనస్య గతౌ సమః ॥ 27

తతస్తస్మిన్ మహాబాహుః కోపసంవర్తితేక్షణః ।
వాయసే కృతవాన్ క్రూరాం మతిం మతిమతాం వరః ॥ 28

స దర్భం సంస్తరాద్గృహ్య బ్రహ్మణోఽస్త్రేణ యోజయత్ ।
స దీప్త ఇవ కాలాగ్నిర్జ్వాలాభిముఖో ద్విజమ్ ॥ 29

స తం ప్రదీప్తం చిక్షేప దర్భం తం వాయసం ప్రతి ।
తతస్తు వాయసం దర్భః సోఽంబరేఽనుజగామ హ ॥ 30 … …

పరిద్యూనం వివర్ణం చ స పతమానం తమబ్రవీత్ ।
మోఘమస్త్రం న శక్యం తు బ్రాహ్మం కర్తుం తదుచ్యతామ్ ॥ 34

తతస్తస్యాక్షి కాకస్య హినస్తి స్మ స దక్షిణమ్ ।
దత్త్వా తు దక్షిణం నేత్రం ప్రాణేభ్యః పరిరక్షితః ॥ 35

రామాయణమ్ - సుందరకాండ - 38/27-35

సీతను వెంటబడి పీడించిన కారణంగా ఆ కాకి కుడికంటిని కోల్పోవలసి వచ్చింది, బ్రహ్మాస్త్రప్రభావానికి. అప్పటినుండి కాకులకు ఒకటే కన్ను. ఒక వ్యక్తి చేసిన తప్పు ఒక జాతినే కలవరపరచింది. కాబట్టి తాను తప్పు చేస్తూ పలితమేదో నేనే అనుభవిస్తాననే వాళ్ళు గమనించవలసిన అంశమిది. తప్పు వ్యక్తి చేసినా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఫలితం ఇంకా దూరం వ్యాపిస్తుంది.

4. శ్రీరామునిలో కాలజలదత్వాన్నీ, ఇన(సూర్య)త్వాన్నీ ఆరోపించి అలంకరించాడీ శ్లోకంలో కవి.



**శ్లో॥ రామే నృణాం హృదభిరామే నరాశికులభీమే మనోఽద్య రమతాం**
**గోమేదినీజయితపోఽమేయగాధిసుతకామే నివిష్టమనసి ।**
**శ్యామే సదా త్వయి జితామేయతాపసజరామే గతాధికసమే**
**భీమేశచాపదలనామేయశౌర్యజితవామేక్షణే విజయిని ॥ 14**

**అవతారిక :** శ్రీ రామావతారస్తుతికే కొనసాగింపు.

**అన్వయక్రమం :** నృణాం హృద్-అభిరామే నర+అశి-కుల-భీమే గో-మేదినీ-జయి. తవః - అమేయ - గాధి-సుత-కామే నివిష్ట-మనసి శ్యామే జిత + అమేయ-తాపస-జ- రామే గత + అధిక-సమే భీమ+ఈశ-చాప-దలన+అమేయ-శౌర్య-జిత-వామ + ఈక్షణే సదా విజయిని రామే త్వయి మనః అద్య రమతామ్.

**ప్రతిపదార్థం :** నృణామ్ = నరులయొక్క, హృద్-అభిరామే = మనోభిరాముడును (హృదామ్ అభిరామః తస్మిన్); నరాశి....భీమే : నర+అశి = నరమాంసం తినే రాక్షసులయొక్క, కుల = సమూహానికి / జాతికి, భీమే = భయంకరుడునూ, (నరాన్ అశ్నన్తీతి నరాశినః తేషాం కులం తస్య భీమః తస్మిన్); గో-మేదినీ....కామే : గో = స్వర్గాన్నీ (ద్యౌర్గౌరమర్త్యభువనం నామ - హలాయుధకోశః-3), మేదినీ = భూమిని, జయి = జయించే / గెలిచే, తపః = తపస్సుచేత, అమేయ = గొప్పవాడైన (లెక్కకందని)

గాధి–సుత = విశ్వామిత్రునియొక్క, కామే = కోరికయందు, నివిష్ట–మనసి = నిలిపిన మనస్సుగల వాడును (నివిష్టం మనః యేన సః), శ్యామే = చామనచాయగలవాడును; జితా....రామే: జిత = ఓడింపబడిన, అమేయ = మేటి అయిన, తాపస–జ = తపస్విగా పుట్టిన, రామే = రాముడు (పరశు రాముడు) గలవాడును; గత+అధిక సమే : గత = తొలగిపోయిన, అధిక = తనను మించిన వారును, సమే = సమానులు గలవాడు (గతౌ అధికసమౌ యస్మాత్ తస్మిన్); భీమే+ఈశ....క్షణే : భీమ = భయంకరమైన, ఈశ = ఈశ్వరునియొక్క, చాప = ధనుస్సును, దలన = విరుచుటయందలి, అమేయ = లెక్కలకందని, శౌర్య = పరాక్రమంచేత, జిత =గెలుచుకొనబడిన, వామ+ఈక్షణే = కాంత (సీత) కలవాడూ, సదా = ఎల్లప్పుడూ, విజయిని = విజయశీలుడూ అయిన, రామే = రాముడవయిన, త్వయి = నీయందు, మనః = నా (మనస్సు), అద్య = ఇప్పుడు, రమతామ్ = క్రీడించు / ఆనందించుగాక (రమ్ క్రీడాయామ్ ఆత్మనేపది లోట్ ప్రథమపురుషైకవచనమ్)

**తాత్పర్యం :** నరులకు మనోభిరాముడూ; నరమాంసభక్షకులైన రాక్షసుల జాతికి భయంకరుడూ; స్వర్గాన్నీ భూమినీ జయించిన తపస్సుచే అసాధారణుడైన విశ్వామిత్రుని కోరికను మనస్సులో నిలుపుకొని తీర్చినవాడూ; చామనచాయరంగు మేనివాడూ, మేటి తాపసి అయిన పరశురాముని జయించినవాడూ, తనకన్నా, అధికులుగానీ తనతో సమానులు గానీ లేనివాడూ, శివధనుస్సును విరిచి తన ఆ పరాక్రమం ద్వారా వీర్యశుల్క అయిన సీతను సొంతం చేసికొన్నవాడూ, సర్వదా విజయశీలుడూ అయిన రాముడవు నీవు. నీయందు నా మనస్సు ఇప్పుడు ఆనందాన్ని పొందుగాక.

**విశేషాలు :** 1. తాటకతో ప్రారంభించి రావణునితో ముగించి, నరమాంసభక్షకులయిన దానవులకు భయంకరమై నిలచినవాడు రాముడు. ఈమధ్యలో మారీచ, సుబాహులూ, ఖరదూషణాదులూ, లంకలోని చివరియుద్ధంలో మరెందరో రాక్షసులూ రాముని బాణాలకెర అయినవారే.

2. గతాధికసముడు రాముడు, సమానుడే లేడని చాటి చెప్పటానికి సిద్ధపడ్డాడు కంచర్ల గోపన్న ఇక అధికుడుండే ప్రసక్తియే లేదు.

**భండనభీముఁ డార్తజనబాంధవుఁ డుజ్జ్వలబాణతూణకో**
**దండకళాప్రచండ భుజతాండవ కీర్తికి రామమూర్తికిన్**
**రెండవసాటి దైవమిక లేడనుచున్ గడగట్టి భేరికా**
**దాండదదాండ దాండ నినదంబు లజాండము నిండ మత్త వే**
**దండము నెక్కి చాటెదను దాశరథీ! కరుణాపయోనిధీ!** – దాశరథి శతకం.

3. విశ్వామిత్రుడు స్వర్గభూలోకాలను తాను జయించాడేమో కానీ త్రిశంకుని స్వర్గానికి పంపటంలో మాత్రం విఫలుడై త్రిశంకుని కోసం మరో స్వర్గాన్ని సృష్టించి ఇచ్చాడు. అందుకోసం సృష్టికి ప్రతిసృష్టి చేసినవాడుగా ఖ్యాతి పొందారు. ఇప్పటికీ కొన్ని పదార్థాలను విశ్వామిత్రసృష్టి అంటూ నిషేధించి, తినటం మానేవాళ్ళు కూడా కనిపిస్తారు.

అటువంటి విశ్వామిత్రుడు తన యాగాన్ని సంరక్షించటానికి రామలక్ష్మణులనే తీసికొని పోయి పెళ్ళి జరిపించి కోడలితో పాటు దశరథునకప్పగించినవాడు విశ్వామిత్రుడు. తాను క్షత్రియుడై

కూడా బ్రహ్మర్షి అని అనిపించుకోవాలనీ, అదీ వశిస్ఠుడు అంగీకరించాలనీ తపన పడి సాధించుకొన్నవాడు.

4. పరశురామునిది మరొక కథ. శ్రీరాముడు శివుని వింటిని విరిచాడన్న కోపంతో వచ్చి తన వైష్ణవధనుస్సును కూడా ఎక్కుపెట్టమని ఒత్తిడి చేసి తన శక్తిని కోల్పోయి లొంగిపోయి నిష్క్రమించినవాడు పరశురాముడు.

శ్లో॥ దేవరాత ఇతి ఖ్యాతో నిమేః షష్ఠో మహీపతిః ।
న్యాసోఽయం తస్య భగవన్ హస్తే దత్తో మహాత్మనా ॥

శ్లో॥ దక్షయజ్ఞవధే పూర్వం ధనురాయమ్య వీర్యవాన్ ।
రుద్రస్తు త్రిదశాన్రోషాత్సలీలమిదమబ్రవీత్ ॥

శ్లో॥ యస్మాద్భాగార్థినో భాగాన్నాకల్పయత మే సురాః ।
వరాంగాణి మహార్హాణి ధనుషా శాతయామి వః ॥

శ్లో॥ తతో విమనసస్సర్వే దేవా వై మునిపుంగవ ।
ప్రసాదయంతి దేవేశం తేషాం ప్రీతోఽభవద్భవః ॥

శ్లో॥ ప్రీతియుక్తస్స సర్వేషాం దదౌ తేషాం మహాత్మనామ్ ।
తదేతద్దేవదేవస్య ధనూరత్నం మహాత్మనః ॥

– రామాయణం బాలకాండ 66/8–12

పరశురాముని దగ్గరున్నది విష్ణుధనుస్సు. రెండింటినీ తయారు చేసింది విశ్వకర్మయే. దేవతలు ఒకదానిని శివునకూ, మరొకదానిని విష్ణువుకూ ఇచ్చారు. శివకేశవుల బలాబల పరీక్షకోసం సిద్ధమైన విండ్లు అవి. ఆ యుద్ధంలో చిరాకుపడిన శివుడు దానిని దేవరాతున కిచ్చాడు. విష్ణువు తన ధనుస్సును భృగువంశస్థుడైన ఋచీకున కిచ్చాడు. ఋచీకుడు పరశురాముని తాత. అలా పరశు రాముని దగ్గరకు వచ్చిందది.



**శ్లో॥ కాన్తారగేహఖలకాన్తారటద్వదనకాన్తాలకాన్తకశరం**
**కాన్తాఽఽర యాఽమ్బుజని కాన్తాన్వవాయవిధుకాన్తాశ్మ భాధిప! హరే! ।**
**కాన్తాలిలోలదలకాన్తాభిశోభితిలకాన్తా భవన్తమను సా**
**కాన్తానుయానజితకాన్తారదుర్గకటకాన్తా రమా త్వవతు మామ్ ॥** **15**

**అవతారిక :** శ్రీరామావతారవర్ణనమే. సీతాస్వరూపయై శ్రీరాముని అనుసరించిన లక్ష్మిని కూడ నుతిచేస్తూ ఆమె అనుగ్రహాన్ని అభ్యర్థించటం విధేయవాక్యం.

**అన్వయక్రమం :** అంబుజని – కాంత + అన్వవాయ – విధుకాంత – అశ్మ! భా – అధిప! హరే! కాంతార – గేహ – ఖల – కాంతా – రటద్ – వదన – కాంత + అలక + అంతక – శరం

భవన్తం కాంత + అలి – లోలద్ – అలక + అంత + అభిశోభి – తిలక + అంతా కాంత + అనుయాన – జిత – కాంతార – దుర్గ – కటక + అంతా యా కాంతా ఆర సా రమా మామ్ అవతు.

**ప్రతిపదార్థం :** అంబు....తాశ్మ : అంబు–జని = నీటబుట్టిన పద్మంయొక్క (అంబుని జన్మ యస్య తత్), అన్వవాయ = వంశానికి (వంశోన్వవాయస్సంతానః – అమరకోశ – బ్రహ్మ–1), విధు–కాంత+అశ్మ! = చంద్రకాంతశిలవంటివాడా! (విధుః కాంతః యస్య తత్ చ తత్ అశ్మ, అంబుజనేః అన్వవాయస్య విధుకాంతాశ్మ యః సః, తస్మాత్ సంబుద్ధౌ); భాః +అధిప! = లక్ష్మీవల్లభా! (భాసః అధిపః భాధిపః – ఆర్షసంధి); హరే! = నారాయణా (రామా)!; కాంతార....శరమ్ : కాంతార = అడవియే, గేహ = వసతిగాగల, ఖల = దుర్జనులయొక్క (రాక్షసులయొక్క – రలలకు తేడాలేదను న్యాయంతో – ఖరుడు రాక్షసులకు ప్రతినిధి), కాంతా = స్త్రీలయొక్క, రటద్ = శబ్దిస్తున్న (కారుకూతలు కూస్తున్న), వదన = మొగాలమీది, కాంత = అందమైన, అలక = ముంగురులను, అంతక = అంతంచేసే, శరమ్ = బాణంవంటి వాడవయిన, భవన్తమ్ = నిన్ను; కాంతా....కాంతా : కాంత = మనోహరమైన, అలి = తుమ్మెదలవలె, లోలద్ = కదులుతున్న, అలక = ముంగురులయొక్క, అన్త = కొనలచే, అభిశోభి = ప్రకాశిస్తున్న, తిలక = (బొట్టుగా తీర్చిన) తిలకంయొక్క, అంతా = కొనలు గలదీ; కాంతా....కాంతా : కాంత= భర్తయొక్క, అను–యాన = అనుసరణంచేత, జిత = జయింపబడిన, కాంతార = అడవులయొక్క, దుర్గ = దాటరాని, కటక = కొండనడుముయొక్క (కటకోఽస్త్రీ నితంబోద్రేః – అమర–శైల–5), అంతా = చివరలుగలదీ అయిన, యా = ఏ, కాంతా = స్త్రీ, ఆర = (అనుసరించి) వచ్చిందో (ఋ గతౌ పరస్మైపది – లిట్ ప్రథమపురుషైకవచనం), సా = ఆ, రమా = లక్ష్మి, మామ్ = నన్ను, అవతు = రక్షించుగాత! (అవ రక్షణ గతికాంతి – పరస్మైపది – లోట్ – ప్రథమపురుషైకవచనం).

**తాత్పర్యం :** సూర్యవంశానికి చంద్రకాంతమణి వంటివాడా! లక్ష్మీవల్లభా! నారాయణా! అడవిలో నివసించే దుర్మార్గులయిన రాక్షసులయొక్క స్త్రీలు నిన్ను తూలనాడుతుంటారు. వారి మొగాలపై కదలాడే ముంగురులను అంతంచేసే బాణానివి నువ్వు. అటువంటి నిన్ను అనుసరించి అడవికి వచ్చింది సీత. ఆమె నుదుటిమీద ముంగురులు తుమ్మెదలవలె శోభిస్తున్నాయి. వాటి కొనలకు అంటుకొని నుదుటి తిలకం శోభిస్తోంది. అటువంటి సీత అడవులనూ, దుర్గమపర్వతాలనూ కూడా నీ అనుసరణంచేత దాటి జయింపగల్గింది. అలా నిన్ను అనుసరించి వచ్చిన సీత నన్ను కాపాడుగాక.

**విశేషాలు :** 1. అరణ్యంలో సీతను ముందుగా బెదిరించిందీ, ఆక్రమించిందీ విరాధుడు. ఆ తరువాత శూర్పణఖ. శూర్పణఖ సకారణంగానే సీతను నిందించింది.

**చిరాయ భవ భర్తా మే సీతయా కిం కరిష్యసి ।**
**వికృతా చ విరూపా చ న చేయం సదృశీ తవ ॥**
**అహమేవానురూపా మే భార్యారూపేణ పశ్య మామ్ ।**
**ఇమాం విరూపా మసతీం కరాలాం నిర్ణతోదరీమ్ ॥** – అరణ్యకాండ – 16/21–23

లంకలో అశోకవనంలో కాపలాగా వున్న రాక్షసకాంతలు చాలామంది సీతను దుర్భాషలాడారు, బెదిరించారు.

2. సూర్యవంశానికి చంద్రకాంతమణివంటివాడని రాముని కీర్తించటం విలక్షణం. విశిష్టం కూడా. రాజు ప్రజలకు ప్రతాపకుడూ కావాలి, ప్రహ్లాదకుడూ కావాలి, ఏది అవసరమయితే అది. అప్పుడే ప్రజారంజనం సాధ్యపడుతుంది. సూర్యవంశానికి మరో పేరయిన రఘువంశానికి కారకుడైన రఘుమహారాజును వర్ణిస్తూ కాళిదాసు పలికిన మాట –

**యథా ప్రహ్లాదనాచ్చంద్రః ప్రతాపాత్తపనో యథా ।**
**తథైవ సోఽభూదన్వర్థః రాజా ప్రకృతిరంజనాత్ ॥** – రఘువంశమ్ 4/12

చల్లదనం సౌజన్యానికి గుర్తు. రాముడు ఎప్పుడూ ఎక్కడా కటువుగా ప్రవర్తించినట్టు కనబడదు. ఆయన జితక్రోధుడు.

3. భాస్ శబ్దానికి (భాధిప) సూర్యుడనీ, శ్రీ అనికూడా అర్థం చెప్తోంది జైమిని ఉపనిషత్ బ్రాహ్మణం.

"తం వా ఏతం హింకారం హిమ్భా ఇతి హింకుర్వంతి, శ్రీర్వై భాః. అసౌ వా ఆదిత్యో భా ఇతి" – ప్రథమానువాకం – చతుర్థఖండం – 1.

కాబట్టి భాధిప అంటే లక్ష్మీవల్లభుడు. సంధి ఆర్షం. అంగీకార్యం.

**4. ఛందోవైచిత్రి :**

సంస్కృతమర్యాద ననుసరించి శ్లోకాలలో ప్రాసనియమముండదు. ప్రతి పాదంలోనూ రెండవ అక్షరం ఒకటే అయివుండటం ప్రాసనియమం. ఈ దశావతారస్తుతిలో దానిని పాటిస్తూనే వున్నాడు కవి. కానీ ఈ శ్లోకంలో మొదటి రెండక్షరాలూ కూడా ప్రతి పాదంలోనూ మూడు మూడు సార్లు కనిపిస్తూ ప్రాసనియమాన్నీ, ప్రాస యతి విధానాన్నీ కూడా ప్రదర్శిస్తూ శ్లోకానికందం తెచ్చాయి. కాంతారమైనా కాంతాసహితం కాబట్టి అందంగానే వుంటుందనీ, రామావతారంలో ఆ దాంపత్యధర్మంకూడా విశేషంగా గ్రహింపవలసినదనీ కవి ఆంతర్యమై వుండవచ్చు.

**శ్లో॥ దాన్తం దశాననసుతాన్తం ధరామధివసన్తం ప్రచణ్డతపసా**
**క్లాన్తం సమేత్య విపినాన్తం త్వవాప యమనన్తం తపస్విపటలమ్ ।**
**యాన్తం భవారతిభయాన్తం మమాశు భగవన్తం భరేణ భజతాత్**
**స్వాన్తం సవారిదనుజాన్తం ధరాధరనిశాన్తం సతాపసవరమ్ ॥** **16**

**అవతారిక :** శ్రీరామావతారవర్ణనకే కొనసాగింపు

**అన్వయక్రమం :** దాంతం దశానన–సుతాంతం ప్రచండ–తపసా క్లాన్తం తపస్వి–పటలం ధరామ్ అధివసన్తం విపిన+అన్తం యాన్తం యమ్ అనన్తం సమేత్య భవ+అరతి – భయ+అన్తమ్ అవాప, సవ + అరి – ధనుజ+అన్తం ధరాధర–నిశాన్తం స–తాపస–వరం (తం) భగవన్తం మమ స్వాన్తం భరేణ భజతాత్.

**ప్రతిపదార్థం :** దాన్తమ్ = నిగ్రహం గలదీ; దశానన–సుతాన్తమ్ : దశ + ఆనన = పదితలలుగల రావణునిచే, సు–తాన్తమ్ = తీవ్రంగా బాధింపబడినదీ (దశ ఆననాని యస్య తేన సుతాన్తమ్); ప్రచండ–తపసా : ప్రచండ = తీవ్రమైన, తపసా = తపస్సుచే (ప్రచండం తపః యస్మిన్ తేన), క్లాన్తమ్ = శ్రమపడినదీ అయిన, తపస్వి–పటలమ్ : తపస్వి = మునులయొక్క, పటలమ్ = సమూహం (పటలం దృగ్రుక్ ఛదిషోః క్లీ న నా పిటకే గణే –వైజయన్తీ–నానా–52), ధరామ్ = నేలపై, అధివసన్తమ్ = నివసిస్తున్నవాడూ (అధి పూర్వకమైన వస ధాతువుయొక్క ఆధారం **"ఉపాన్వధ్యాఙ్వసః"** (అష్టాధ్యాయి 1–4–47) సూత్రంలో కర్మ అవుతుంది. "కర్మణి ద్వితీయా" (అష్టాధ్యాయి 2–3–2) సూత్రంతో ద్వితీయావిభక్తి = ధరామ్); విపిన+అన్తమ్ = అడవుల చివరకు (విపినానామ్ అంతః తమ్) (అన్తో జఘన్యం చరమం – అమరకోశః–విశేష్య–81), యాన్తమ్ = వెళ్తున్నవాడూ అయిన, యమ్ = ఏ, అనన్తమ్ = అనంతుని (నాస్తి అంతః యస్య తమ్), సమేత్య = చేరి (సమ్–ఆ–ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం); భవ.....న్తమ్ : భవ = సంసారంపై, అరతి = అనాసక్తిచేత, భయ = భయంయొక్క, అన్తమ్ = ముగింపును (భవే అరతిః తయా భయస్య అన్తః తమ్), అవాప = పొందిందో (అవ + ఆప్ వ్యాప్తౌ పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.); సవ+అరి–ధనుజ + అన్తమ్ : సవ = యాగానికి (యజ్ఞస్సవోఽధ్వరో యాగః – అమరకోశః–బ్రహ్మ–13), అరి = శత్రువులైన, దనుజ = రాక్షసులకు, అన్తమ్ = ముగింపు అయినవాడు (సవస్య అరయః చ తే దనుజాః తేషామ్ అన్తః తమ్); ధరాధర–నిశాన్తమ్ : ధరాధర = కొండ, నిశాన్తమ్ = వసతిగా గలవాడు (ధరాధర ఏవ నిశాన్తం యస్య తమ్) (నిశాంతం గృహశాంతయోః – వైజయన్తీ–నానా–51); స–తాపస–వరమ్ = తాపసశ్రేష్ఠులతో కూడివున్నవాడు అయిన; తమ్ = ఆ, భగవన్తమ్ = శ్రీరాముని, మమ = నాయొక్క, స్వాన్తమ్ = మనస్సు, ఆశు = వేగంగా, భరేణ = నిండుగా, భజతాత్ = సేవించుగాక (భజ సేవాయాం పరస్మైపది – లోట్ – ప్రథమపురుష– ఏకవచనం)

**తాత్పర్యం :** జితేంద్రియులై కూడా తాపసులు ప్రచండతపస్సు చేసి అలసిపోతున్నారు. పైపెచ్చు వారికి రావణునిద్వారా ఎంతో పీడ. అటువంటివారు నేలకు అవతరించి అడవులలోనికి బయలుదేరిన రాముని కూడి తమ భవార్తిభయాన్ని పోగొట్టుకోగలిగారు. యాగాలకు శత్రువులయిన రాక్షసులను దునుమాడి కొండపై తాపసశ్రేష్ఠులతో కూడి నివసిస్తున్న ఆ అనంతుని నా మనస్సు వేగంగా, నిండుగా సేవించునుగాక.

**విశేషాలు :** 1. దండకారణ్యంలోని రావణానుచరులు మహర్షులను పీడించటం –

**శ్లో॥ రక్షాంసి పురుషాదాని నానారూపాణి రాఘవ ।**
**వసన్త్యస్మిన్ మహారణ్యే వ్యాలాశ్చ రుధిరాశనాః ॥**

**శ్లో॥ ఉచ్ఛిష్టం వా ప్రమత్తం వా తాపసం బ్రహ్మచారిణమ్ ।**
**అదన్త్యస్మిన్ మహారణ్యే తాన్నివారయ రాఘవ ॥**
– అయోధ్యకాండ – 16/19, 20

రావణుడే సాక్షాత్తు ఋషులను, ఋషికన్యకలను పీడించటం ఉత్తరకాండలో కనిపిస్తుంది.

**శ్లో॥ నివర్తమానః సంహృష్టో రావణః స దురాత్మవాన్ ।**
**జహ్రే పథి నరేంద్రర్షిదేవదానవకన్యకాః ॥** – ఉత్తరకాండ-24/1

2. భవ + ఆర్తి – భయం :

సంసారభయం, దానినుండి బయటపడటానికి జరిగే పోరాటం అనాది, అనంతం. శ్రీరాముడే తన మాటల్లో ఆ సాంసారికబంధాల శక్తిని వివరిస్తాడు ఉత్తరరామ చరితనాటకంలో రామపాత్ర ద్వారా –

ఏవమేతే **హృదయమర్మచ్ఛిదః సంసారభాగాః** యేభ్యో బీభత్సమానాః సర్వాన్ కామాన్ పరిత్యజ్య అరణ్యేషు మనీషిణో విశ్రామ్యన్తి – ఉత్తరరామచరితం – ప్రథమాంకం.

3. సవ + అరి – దనుజ

విశ్వామిత్రయజ్ఞవిఘ్నాన్ని కలిగిస్తున్న రాక్షసులు ప్రధానంగా మారీచ, సుబాహులు. వారినిద్దరినీ సంహరించినవాడు శ్రీరాముడు.

విశ్వామిత్రుడు చేస్తున్నది దేవయజ్ఞం. పంచమహాయజ్ఞాలు ఆచరింపవలసినవని స్మృతి గ్రంథాలు చెప్తాయి.

అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్ ।
**హోమో దైవో** బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమ్ ॥ –మనుస్మృతి 3/70

బ్రహ్మయజ్ఞం (పాఠప్రవచనం) పితృయజ్ఞం (తర్పణం) దైవయజ్ఞం (హోమం), భూతయజ్ఞం (బలి) నృయజ్ఞం (అతిథిపూజ). ఈ అయిదు పంచమహాయజ్ఞాలు. **వీటి నన్నింటినీ పరిపూర్ణంగా ఆచరించే అవకాశం గృహస్థాశ్రమంలోనే వుంటుంది.** అందుకే గృహస్థవానప్రస్థాశ్రమాలకు మన సంస్కృతిలో ప్రాధాన్యం.



**శ్లో॥ శంపాభచాపలవకంపాస్తశత్రుబలసంపాదితామితయశాః**
**శం పాదతామరససంపాతినోఽలమనుకంపారసేన దిశ మే ।**
**సంపాతిపక్షి సహజం పాపిరావణహతం పావనం యదకృథాః**
**త్వం పాపకూపపతితం పాహి మాం తదపి పంపాసరస్తటచర! ॥** **17**

**అవతారిక :** రామావతారవర్ణనకే కొనసాగింపు. రామకథలోని రెండు సంఘటనలకూ, తనవైన రెండు అభ్యర్థనలకు శ్లోకంలో స్థానం.

**అన్వయక్రమం :** శంపా + ఆభ-చాప-లవ-కంప+అస్త-శత్రు-బల-సంపాదిత- అమిత- యశాః త్వం పాద-తామరస-సంపాతినః మే అనుకంపా-రసేన అలం శం దిశ, పంపా- సరః-తట-చర! త్వం పాపి-రావణ-హతం సంపాతి-పక్షి-సహజం యత్ పావనమ్ అకృథాః తత్ పాప-కూప-పతితం మామ్ అపి పాహి.

**ప్రతిపదార్థం :** శంపా......యశాః : శంపా = మెరుపుతో (శంపా శతహ్రదా హ్రాదినీ- అమరకోశః - దిక్-9), ఆభ = పోలికగల (ఆభా ప్రఖ్యోపమాభిఖ్యా - వైజయన్తీ - అర్థ-122), చాప = వింటియొక్క, లవ = స్వల్పమైన, కంప = కదలికచేత, అస్త = నశించిన, శత్రు = శత్రువుయొక్క, బల = శక్తిచేత, సంపాదిత = సంపాదింపబడిన, అమిత = మేరలేని, యశాః = కీర్తిగలవాడవై (శంపయా ఆభా యస్య తత్, తచ్చ తత్ చాపః, తస్య లవేన కంపేన అస్తేన శత్రోః బలేన సంపాదితమ్ అమితం యశః యేన సః), త్వమ్ = నీవు; పాద-తామరస-సంపాతినః : పాద-తామరస = పాదపద్మాలపై (పంకేరుహం తామరసం - అమర-వారి.40), సంపాతినః = పడుతున్న (పాదౌ ఏవ తామరసే - తయోః సంపతీతి, తస్య), మే = నాకు; అనుకంపా-రసేన = దయారసంతో (అనుకంపా ఇతి రసః తేన), అలమ్ = తగినంత, శమ్ = సుఖాన్ని, దిశ = ఇవ్వు; పంపా-సరః + తట-చర : పంపాసరః = పంపాసరస్సుయొక్క, తట = ఒడ్డున, చర! = చరిస్తున్నవాడా!, త్వమ్ = నీవు; పాపి-రావణ-హతమ్ : పాపి = పాపంగల, రావణ = రావణునిచే, హతమ్ = హింసింపబడిన (పాపీ చ అసౌ రావణః తేన హతః తమ్); సంపాతి-పక్షి-సహజమ్ : సంపాతి = సంపాతి అనే, పక్షి = పక్షికి, సహజమ్ = తోడబుట్టినవానిని (జటాయువును) సంపాతిః ఇతి పక్షీ తేన సహ జాతవాన్ ఇతి తమ్), యత్ = ఏ కారణంచేత, పావనమ్ = పవిత్రునిగా, అకృథాః = చేశావో, తత్ = ఆ కారణంతో; పాప-కూప-పతితమ్ : పాప = పాపమనే, కూప = బావిలో, పతితమ్ = పడినట్టి (పాపమ్ ఏవ కూపః తస్మిన్ పతితః తమ్), మామ్ = నన్ను, పాహి = కాపాడు (పా రక్షణే పరస్మైపది - లోట్ - మ.ఏ.)

**తాత్పర్యం :** మెరుపుతీగ వంటి వింటిని కొంచెం కదలించి, శత్రుబలాన్ని అస్తమింపజేసి అంతులేని కీర్తిని పొందినవాడవు నీవు. నీ పాదపద్మాలపై వ్రాలిన నాకు దయతో సుఖాన్ని అందించు. పాపాత్ముడైన రావణునిచే హింసింపబడిన జటాయువును ఏ కారణంతో పవిత్రుని చేశావో అదే కారణంతో పాపకూపంలో పడిన నన్ను కూడా కాపాడి, ఉద్ధరించు.

**విశేషాలు :** శ్రీరాముని చేతిలోని విల్లు కొంచెం కదిలితే చాలు శత్రువుల బలం అస్తమిస్తుందనటం రామపరాక్రమవచనం. రాముడు పోరాడిన అన్నివేళలా అది కనిపిస్తుంది. ఆ శక్తిని వాల్మీకి ధ్వనింపజేసిన ఒక సన్నివేశాన్ని చూద్దాం -

**శ్లో॥ స తద్దత్తం మఘవతా సురరాజేన ధీమతా ।**
**సందధే చ స ధర్మాత్మా ముమోచ చ ఖరం ప్రతి ॥**

**శ్లో॥ స విముక్తో మహాబాణో నిర్ఘాతసమనిస్స్వనః ।**
**రామేణ ధనురాయమ్య ఖరస్యోపరి చాపతాత్ ॥** - అరణ్యకాండ - 30/25,26

రాముడు ఖరునిపై బాణం వేశాడు. అది పిడుగుపాటులా ధ్వనిస్తుంది. ఆ విషయం ముందు చెప్పి తరువాత 'రాముడు విల్లు వంచాడు' అని చెప్పటం. మామూలుగా ముందు వింటిని వంచి, అల్లెత్రాటిని లాగి ఆపై బాణాన్ని వదలాలి. కానీ ఇక్కడ ముందు బాణం వదలి ఆపై వింటిని వంచాడు. అంటే అది ఆ వేగానికి సూచిక. వింటినే ముందు వంచాడో, బాణాన్నే ముందు విడిచాడో

గ్రహింపుకు రానంత వేగం. ఇది శతపత్రపత్రశత వేధన్యాయాన్ని మించిన వేగం. అందుకే **వాదిరాజు** బాణం కొంచెం కదిలితే చాలు శత్రుబలం అంతమైనట్లే అనటం జరిగింది.

2. పాపి అయిన రావణునిచే హింసింపబడిన జటాయువును ఏ కారణంతో కాపాడావో (పవిత్రుని చేశావో) అదే కారణంతో పాపకూపంలో పడిన నన్ను కాపాడు అని కవి మొరపెట్టుకొంటున్నాడు. అంటే ఇక్కడ జటాయువును కాపాడటానికి, తనను కాపాడటానికి ఒకటే కారణం కావాలి. కానీ అక్కడేమో హింసించిన రావణుడు పాపి. ఇక్కడేమో అర్థిస్తున్న వ్యక్తి పాపకూప పతితుడు. మరి ఒకే కారణం ఎలా?

**'రామో విగ్రహవాన్ ధర్మః'** అని రాముని ఆయన శత్రువులు కూడా ప్రస్తుతించారు. ధర్మమే తన స్వరూపం. రాముడు – ధర్మం ఈ రెండింటిలో ధర్మాన్ని ఆశ్రయించినవాడు జటాయువు. ధర్మిని (రాముని) ఆశ్రయించినవాడు కవి. ధర్మానికీ, ధర్మికీ భేదం లేదు అన్న న్యాయాన్ని బట్టి – అది నిత్యసంబంధం– కాబట్టి ఇక్కడ ఇద్దరికీ ఒకే కారణం కుదురుతోంది.

జటాయువు ధర్మాన్ని ఎలా ఆశ్రయించాడు?

రావణుడు సీతను కొనిపోతున్నప్పుడు సీత జటాయువును చూసి నీవు యుద్ధం చేయలేవు కానీ రామలక్ష్మణులకు ఈ సంగతిని తెలియజేయమని మాత్రమే అడిగింది. అయినా జటాయువు తనకు 60 సంవత్సరాల వయస్సయినా, యువకుడైన రావణునితో పోరాడటానికి సిద్ధపడ్డాడు ధర్మం కోసం.

తాను పక్షిరాజు. అది తన రాజ్యం. రావణుడికి ముందే చెప్పాడు 'రాముడు నీ రాజ్యంలోనికి అడుగుపెట్టలేదు గదా' అని. తన రాజ్యంలో అధర్మం జరుగుతున్నప్పుడు కాపాడవలసిన బాధ్యత తనకుంది. ఆ మాటే చెప్పాడు.

**శ్లో॥ అర్థం వా యది వా కామం శిష్టాః శాస్త్రేష్వనాగతమ్ ।**
**వ్యవస్యన్త్యను రాజానం ధర్మం పౌలస్త్యనందన! ॥**

**శ్లో॥ రాజా ధర్మశ్చ కామశ్చ ద్రవ్యాణాం చోత్తమోని ధిః ।**
**ధర్మః శుభం వా పాపం వా రాజమూలం ప్రవర్తతే ॥** – అరణ్యకాండ 50/9,10

కాబట్టి తాను రాజుగా వున్న తన ప్రాంతంలో జరుగుతున్న అధర్మాన్ని తానెదిరించి ప్రాణాలమీదకు తెచ్చుకొన్నాడు. కాబట్టి ధర్మాన్ని ఆశ్రయించినవాడు జటాయువు. రాముడు ధర్మస్వరూపుడు.

కవి పాపకూపపతితునిగా తనను భావిస్తున్నాడు. ఇది వినయప్రదర్శన కావచ్చు. అపరిహార్యమైన పాపపతనం కావచ్చు. తెలియనితనంలో చేసినపాపాలను గురించి తాను ప్రస్తావించి వుండవచ్చు. భక్తిభావనలోనూ, శరణాగతిలోనూ తమను తాము పాపులుగా భావించుకోవటం, అంగీకరించటం ఒక ఆనవాయితీ

శ్లో॥ పాపోఽహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః ।
పాహి మాం కృపయా దేవ శరణాగతవత్సల! ॥

అని పూజాంతంలో చెప్తుంటాం. ఇక్కడ కూడా కవి అలాగే చెప్పాడని భావించాలి. అది అటుంచితే ధర్మస్వరూపుడై ధర్మానికి ఆశ్రయమైన రాముని ఆశ్రయించాడు కవి. అంటే ధర్మిని. సంపాతిమాటలకు, కవి రచనలకు ఇదే తేడా.



శ్లో॥ లోలాక్ష్యపేక్షితసులీలాకురఙ్గవధఖేలాకుతూహలగతే!
స్వాలాపభూమిజనిబాలాపహార్యనుజపాలాద్య! భో! జయజయ ।
వాలాగ్నిదగ్ధపురశాలానిలాత్మజనిఫాలాత్తపత్తలరజో!
నీలాఙ్గదాదికపిమాలాకృతాలిపథమూలాభ్యతీతజలధే! ॥ 18

**అవతారిక :** రామావతారస్తుతికే కొనసాగింపు. రామావతారంలోని నాలుగు సన్నివేశాల ప్రస్తావన.

**అన్వయక్రమం :** లోల + అక్షీ + అపేక్షిత – సులీలా – కురంగ – వధ – ఖేలా – కుతూహల – గతే! స్వ + ఆలాప – భూమిజని – బాలా + అపహారి + అనుజ – పాల! ఆద్య వాల + అగ్ని – దగ్ధ – పుర – శాలా + అనిల + ఆత్మజని – ఫాల + ఆత్త – పద్(త్) తల – రజః! నీల + అంగద + ఆది – కపి – మాలా – కృత + ఆలి – పథ – మూల + అభ్యతీత – జలధే! భో! జయ జయ.

**ప్రతిపదార్థం :** లోలా... గతే : లోల = చంచలమైన, అక్షీ = కన్నులుగల (సీతచేత), అపేక్షిత = కోరబడిన, సు–లీలా = మంచి విలాసాలుగల, కురంగ = జింకను (మృగరూపంలో వున్న మారీచుని), వధ = చంపుట అనే, ఖేలా = ఆటయందు, కుతూహల = ఆసక్తిగల, గతే = నడక గలవాడా!; స్వాలాప... పాల : స్వ = తనయొక్క, ఆలాప = మాటలద్వారా / లెస్సగా పలుకుట ద్వారా, భూమిజని = పుడమి పుట్టువు అయిన (భూమేః జనిః యస్యాః సా భూమిజనిః – జనుర్జనన జన్మాని జనిరుత్పత్తిరుద్భవః అమరకోశం), బాలా = వధూటి అయిన సీతను, అపహారి = అపహరించిన రావణుని యొక్క, అనుజ = తమ్ముని (అను జాయతే ఇతి అనుజః = తన వెనుక పుట్టినవాడు), పాల! = రక్షించినవాడా!; ఆద్య! = తొలినాటివాడా! (ఆదౌ భవః ఆద్యః, 'సర్వః శర్వః శివః స్థాణుర్భూతాదిర్నిధిరవ్యయః' విష్ణుసహస్రనామస్తోత్రమ్); వాలాగ్ని... రజః : వాల = తోకను వ్యాపించియున్న / అంటివున్న (ఇక్కడ సప్తమి అభివ్యాపకమైనా, ఔపశ్లేషికమైనా కావచ్చు), అగ్ని = నిప్పుచేత, దగ్ధ = తగులబెట్టబడిన, పుర = నగరమందలి, శాలా = గృహములు లేదా ఇంటిలోని కొన్ని భాగాలు గల (శాలాద్రుస్కంధశాఖాయాం గేహే గృహైకదేశయోః – మేదినీకోశం), అనిల + ఆత్మజని = వాయుదేవుని కొడుకైన మారుతియొక్క, ఫాల= నుదుటిచేత, ఆత్త = పొందబడిన, పద్ = కాలియొక్క, తల = అడుగుభాగమందలి (తలం స్వరూపాధరయోః – విశ్వకోశం), రజః! = పాదధూళి గలవాడా!; నీలాంగ... జలధే! : నీల + అంగద + ఆది = నీలుడు, అంగదుడు మొదలుగాగల, కపి = క్రోతులయొక్క, మాలా = వరుసచేత, కృత = చేయబడిన / కల్పింపబడిన,

ఆలి = సేతువనెడి (సేతురాలౌ స్త్రియాం పుమాన్ - అమరకోశం), పథ = బాటయే, మూల = కారణంగా, అభ్యతీత = దాటిన, జల-ధే! = సముద్రం గలవాడా!, భో! = ఓయి (రామా)!, జయ జయ = వర్ధిల్లుము (జి జయే ధాతువుమీద లోట్ మధ్యమపురుషైక వచనం)

**తాత్పర్యం :** ఓ శ్రీరామా! లోలాక్షి అయిన సీత కోరిన మాయలేడిని సంహరించాలన్న ఆట మీది ప్రేమతో ముందుకు నడిచినవాడవు నీవు. తన (మాయ) మాటలతో సీతాకుమారిని అపహరించిన రావణుని సోదరుని ఆదరించినవాడవు నీవు. జగదాదివి నీవే. తన తోకను దహిస్తున్న నిప్పుతో లంకలోని ఇళ్ళను పూర్తిగా కానీ, పాక్షికంగా కానీ తగలబెట్టిన వాయునందనుని నుదుటినంటిన పాదధూళి గలవాడవు నీవు. నీలుడు, అంగదుడు మొదలుగాగల క్రోతిమూకలు కల్పించిన సేతుమార్గంద్వారా సముద్రాన్ని దాటినవాడవు నీవు - జయహో!

**విశేషాలు :** ఈ శ్లోకంలో నాలుగు సందర్భాలలో నలుగురిని రాముడు ఆదరించిన / ఆశీర్వదించిన తీరు వర్ణింపబడింది.

**1. సీత మాయలేడిని కోరితే దాన్ని తీర్చే ప్రయత్నం -**

ఇక్కడ 'లోలాక్షీ' అని సీతా నిర్దేశం. అక్షి పదం అక్షిగతమైన దృష్టికి ఉపలక్షకం. చంచలమైన చూపు (ఆలోచన) గలదని భావం. అందుకే ఎప్పుడూ ఏదీ అడగని సీత బంగారులేడిని కోరింది.

శ్లో॥ ఆర్యపుత్రాభిరామోఽసౌ మృగో హరతి మే మనః ।
ఆనయైనం మహాబాహో! క్రీడార్థం **నో భవిష్యతి** ॥ -అరణ్యకాండ-43/10.

అది సీత కోరిక. క్రీడార్థం - సీత అడిగితే **'కురంగవధఖేలా'** అని కవి రాముని స్తుతిస్తున్నాడు. దాన్ని చంపటం శ్రీరాముని క్రీడ. రామవచనాన్ని గమనించండి-

శ్లో॥ పశ్య లక్ష్మణవైదేహ్యాః స్పృహాముల్లసితామిమామ్ ।
రూపశ్రేష్ఠతయా హ్యేష మృగోఽద్య **న భవిష్యతి** ॥ -అరణ్య-43/25.

సీతా సంకల్పాన్ని (నః + భవిష్యతి / నో-భవిష్యతి) తీర్చటానికే శ్రీరాముడు బయలుదేరినట్లయింది. (న భవిష్యతి).

**2. విభీషణుని ఆదరించటం**

తన మాయమాటలతో సీతనపహరించిన రావణుని తమ్ముని ఆదరించటం. విభీషణునికి అభయమివ్వటం శ్రీరామునిలోని ఔదార్యానికి సంకేతమని విజ్ఞుల భావన.

విభీషణస్వీకరణవిషయంలో రాముని శిబిరంలో పెద్దచర్చ జరిగింది రామ సమ్ముఖంలోనే. విభీషణుని ఆంతర్యాన్ని హనుమంతుడు అద్దం పట్టినట్టు వివరించాడు. రామాయణం-యుద్ధ-17/66,67

శ్లో॥ ఉద్యోగం తవ సంప్రేక్ష్య మిథ్యావృత్తం చ రాఘవమ్ ।
వాలినం చ హతం శ్రుత్వా సుగ్రీవం చాభిషేచితమ్ ॥

శ్లో॥ రాజ్యం ప్రార్థయమానస్తు బుద్ధిపూర్వమిహాగతః ।
ఏతావత్తు పురస్కృత్య విద్యతే తస్య సంగ్రహః ॥

శ్రీరాముడు దానిని అంగీకరిస్తూనే తన నిశ్చితమతిని కూడా ఇలా ప్రకటించాడు – రామాయణం–యుద్ధ– 18/33

శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥

**3. హనుమంతుని రామపాద నమస్కృతి**

లంకాదహనకర్మతో ప్రారంభించి హనుమంతుడు శ్రీరాముని దగ్గరకు తిరిగి రావటం వరకు ఉన్న కథాభాగ మీ మూడవపాదం / అంశం. శ్రీరామునికి పాదాలకు నమస్కరించిన హనుమంతుని నుదుట రామపాదధూళి అంటినదట. అదే ప్రియ సింధూరమై ఉంటుంది.

**4. సేతుబన్ధసన్నివేశం – సముద్రతరణం**

నలుడు సేతువును నిర్మించినట్లు రామాయణం చెప్తోంది.

శ్లో॥ స నలేన కృతఃసేతుః సాగరే మకరాలయే ।
శుశుభే సుభగః శ్రీమాన్ స్వాతీపథ ఇవాంబరే ॥ –యుద్ధ– 22/70

నలుడు సాంకేతికవిషయవేత్తగా సేతునిర్మాణం చేయటం వాస్తవమే. నీలాంగదాదులు పనిచేయటానికి వానరులను ప్రోత్సహించటంలో ప్రధానపాత్ర వహించి ఉండవచ్చు. అందుకే 'నీలాంగదాది'... అని కవి ప్రయోగించటం.



**శ్లో॥ తూణీరకార్ముకకృపాణీకిణాంకభుజపాణీరవిప్రతిమభాః
క్షోణీధరాలినిభఘోణీముఖాదిఘనవేణీసురక్షణకరః ।
శోణీభవన్నయనకోణీజితాంబునిధిపాణీరితార్హణమణి–
శ్రేణీవృతాంఘ్రిరిహ వాణీశసూనువరహాణీస్తుతో విజయతే ॥ 19**

**అవతారిక :** శ్రీరామావతారస్తుతియే. రామునిలోని కరుణను, శౌర్యాన్ని ప్రస్తుతించటం.

**అన్వయక్రమం :** తూణీర – కార్ముక – కృపాణీ – కిణ + అంక – భుజ – పాణిః రవి – ప్రతిమ – భాః క్షోణీధర + ఆలి – నిభ – ఘోణీముఖ + ఆది – ఘన – వేణీ – సురక్షణ – కరః శోణీభవత్ + నయన – కోణీ – జిత + అంబు – నిధి – పాణి + ఈరిత + అర్హణ – మణి – శ్రేణీ – వృత + అంఘ్రిః వాణీ + ఈశ – సూను – వర – వాణీ – స్తుతః ఇహ విజయతే.

**ప్రతిపదార్థం :** తూణీర... పాణిః : తూణీర = అమ్ములపొది, కార్ముక = విల్లు, కృపాణీ = బాకు... వీటిచే, కిణ + అంక = కాయగాచిన గుర్తుగల (కిణో రూఢం వ్రణస్థానే – అని వైజయన్తీకోశం), భుజ = భుజములూ, పాణిః = చేయిగలవాడూ; రవి... భా : రవి = సూర్యునితో, ప్రతిమ =

సమానమైన, (స్యురుత్తరపదే ప్రఖ్యః ప్రకారః ప్రతిమో నిభః – అని అభిధానచిన్తామణి), భాః = కాంతిగలవాడునూ (రవిణా ప్రతిమా భాః యస్య సః); క్షోణీ... కరః : క్షోణీధర = పర్వతాలయొక్క; అలి = వరుసలతో, నిభ = సమానమైన, ఘోణీ ముఖ + ఆది = హనుమ మొదలుగా గల క్రోతులయొక్క (ఘోణ్యాః ముఖమివ ముఖం యస్య సః ఘోణీముఖః = పందిముఖంవంటి ముఖం గలవాడు), ఘన = దట్టమైన, వేణీ = జుత్తును / జడపాయలను లేదా అధ్యవసాయం ద్వారా జడపాయలవలె నిలిచిన సేనలను, సురక్షణ = బాగుగా కాపాడెడి, కరః = చేయి గలవాడునూ; శోణీ... తాంఘ్రిః : శోణీభవత్ = ఎఱ్ఱబడుతున్న, నయన = కన్నులయొక్క, కోణీ = కొనలచే, పాణి = చేతులతో, ఈరిత = సమర్పింపబడిన, అర్హణ = పూజ / సపర్య యందలి, మణి = మణులయొక్క, శ్రేణీ = వరుసలచే, వృత = ఆవరింపబడిన, అంఘ్రిః = కాళ్ళుగలవాడునూ; వాణీశ... స్తుతః : వాణీశ = బ్రహ్మదేవునియొక్క / ముఖ్యప్రాణదేవరయొక్క, సూను = కుమారుడైన ఆంజనేయునియొక్క, వర = శ్రేష్ఠమైన, వాణీ = మాటలతో / భాషతో, స్తుతః = నుతింపబడినవాడునూ అయిన శ్రీరాముడు; ఇహ = ఇక్కడ / భూలోకంలో / ప్రకృతస్తుతిలో; విజయతే = వర్ధిల్లుతున్నాడు (వి+జి జయే ధాతువుపై లట్ ప్రథమపురుషైకవచనం).

**తాత్పర్యం :** రామా! అమ్ములపొదినీ, వింటినీ ధరించటం చేత నీ భుజాలూ, బాకును పట్టినందువల్ల నీ చేయి కాయలు కాచి ఉన్నాయి. కొండల వరుసలా కనిపించే క్రోతులూ మొదలైన నీ సేనలను రక్షించే చేయి నీది. సముద్రాన్ని దాటి లంకకు చేరాలని నీవు సముద్రుని దారినిమ్మని అడిగావు. ఆ విషయంలో జాగుచేస్తున్న సముద్రునిపై నువ్వు కన్నెఱ్ఱచేశావు. దానితో (భయపడిన) సముద్రుడు నీ పాదాల నర్చించాడు. ఆ అర్చనలో సమర్పించిన మణులు నీ పాదాలను ఆవరించాయి. హనుమంతుని శ్రేష్ఠవచనాలచే నుతింపబడినవాడవు నీవు. ఈ లోకంలో వర్ధిల్లుతున్నావు.

**విశేషాలు :** 1. శ్రీరాముడు ప్రధానంగా కోదండపాణి. శత్రుసంహారానికి తాను ప్రధానంగా వాడినది ధనుర్బాణాలనే.

శ్లో॥ అగ్రతః పృష్ఠతశ్చైవ పార్శ్వతశ్చ మహాబలౌ ।
ఆకర్ణపూర్ణధన్వానౌ రక్షతాం రామలక్ష్మణౌ ॥

అనే ప్రసిద్ధప్రార్థనశ్లోకం కూడా భక్తాభిప్రాయంగా దాన్నే సూచిస్తుంది.

ఇక్కడ కవి చిన్నకత్తి పట్టడం ద్వారా చేయి కాయకాచి ఉన్నట్లు వర్ణిస్తున్నాడు. అది క్షత్రియోచితధర్మంగా శ్రీరాముడు కూడా కత్తి పట్టడాన్ని భావనతో చేసిన వర్ణనగా మనం స్వీకరించాలి.

2. ఆంజనేయుడు పంచముఖుడుగా ప్రసిద్ధి. ఆ తూర్పుముఖం ఆంజనేయం; దక్షిణముఖం = ఉగ్రనరసింహం; పడమటిముఖం = గరుడం; ఉత్తరముఖం = లక్ష్మీవరాహం; ఊర్ధ్వముఖం = హయగ్రీవం – కాబట్టి హనుమంతుడు ఘోణీముఖుడు.

3. మాధ్వమతంలో ముఖ్యప్రాణుని కుమారుడుగా హనుమంతుడు, భీమసేనుడు, ముఖ్యప్రాణుని అవతారంగా మధ్వాచార్యులు పరిగణింపబడతారు. ఇతరత్ర కూడా ఆంజనేయ, భీమసేనులు వాయుసుతులే. కాకపోతే మాధ్వంలో వాయువే ముఖ్యప్రాణ దేవర (ప్రధాన దేవత).

**4. వరవాణీస్తుతః :** హనుమంతుని మాట అత్యుత్తమమైనది. రామలక్ష్మణులతో తాను కలిసిన మొట్టమొదటయే తన మాటలతో వారిని ప్రభావితం చేయగలిగిన మనీషి తాను. తొలికలయికలో మారుతి మాటలు విన్న తరువాత శ్రీరాముడు లక్ష్మణునితో అన్న మాటలు చూడండి –

శ్లో॥ నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః ।
నా సామవేదవిదుషః శక్యమేవం విభాషితుమ్ ॥

శ్లో॥ నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్ ।
బహువ్యాహరతానేన న కించదపి శబ్దితమ్ ॥ – కిష్కింధా – 3/28, 29

ఋగ్యజుస్సామవేదాలు, వ్యాకరణం సంపూర్ణంగా అధ్యయనం చేసిన సంస్కారం హనుమంతుని పలుకులలోనే వ్యక్తమవుతుంది.

మన జ్ఞానం మన మాటతీరులోనే కనిపించాలి.



**శ్లో॥ హుఙ్కారపూర్వమథ టఙ్కారనాదమతిపఙ్కావధార్య చలితా**
**లఙ్కా శిలోచ్చయవిశఙ్కాపతద్భిదురశఙ్కాఽఽస యస్య ధనుషః ।**
**లఙ్కాధిపోఽమనుత యం కాళరాత్రిమివ శఙ్కాశతాకులధియా**
**తం కాలదణ్డశతసఙ్కాశకార్ముకశరాఙ్కాన్వితం భజ హరిమ్ ॥ 20**

**అవతారిక :** శ్రీరామస్తుతియే. కోదండప్రభావప్రస్తుతి.

**అన్వయక్రమం:** అథ యస్య ధనుషః హుంకార – పూర్వమ్ టంకార – నాదమ్ అవధార్య అతిపంకా లంకా శిలా + ఉచ్చయ – విశంక + ఆపతత్ – భిదుర – శంకా (సతీ) చలితా ఆస లంకా + అధిపః శంకా – శత + ఆకుల – ధియా యం కాళ – రాత్రిమ్ + ఇవ అమనుత కాల – దండ – శత – సంకాశ – కార్ముక – శర + అంక + అన్వితం తం హరిం భజ.

**ప్రతిపదార్థం :** అథ = (మంగళకరముగా) అటుపై (ఓంకారశ్చాథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా । కణ్ఠం భిత్త్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ ॥ కాబట్టి అథ శబ్దం ఓంకారంతో సమానం); యస్య = ఎవనియొక్క; ధనుషః = వింటియొక్క; హుంకార– పూర్వమ్ = హుంకారపూర్వకంగా వున్న – హుంకారం బెదిరింపును తెలుపుతుంది (ఆమన్త్రణే భర్త్సనే హుమ్ – అని వైజయన్తీ కోశం); టంకార–నాదమ్ = టంకారధ్వని నాదాన్ని (అల్లెత్రాటిమ్రోత టంకారం. 'టంకారశ్శింజినీ ధ్వనౌ' అని విశ్వకోశము. టంకారపదంలోనే ధ్వనిపదం కూడా ఇమిడి ఉంది. అది అనురణనంగా వినిపించటం నాదం); అవధార్య = విని / అవధరించి; అతిపంకా = మిక్కిలి కలుషితమైన; లంకా = లంకానగరం; శిలా + ఉచ్చయ = పర్వతాలమై (ప్రపాత్యద్రిశ్శిలోచ్చయః – అని వైజయన్తీకోశం), విశంక = కొంకు లేకుండా, ఆపతత్ = పూర్తిగా పడుతున్న; భిదుర = వజ్రాయుధమను (కులిశం భిదురం పవిః – అని అమరకోశం); శంకా = సందేహం; ఆస = కలిగిందో (అస భువి ధాతువుపై లిట్ ప్రథమపురుషైకవచనం); లంకా + అధిపః = లంకకు ప్రభువైన రావణుడు; శంకా.... ధియా :

శంకా – శత = వందల అనుమానాలు గల, ధియా = బుద్ధితో; యమ్ = ఎవనిని; కాళ – రాత్రిమ్ ఇవ = కాళరాత్రిని వలె; అమనుత = భావించాడో (మన్ అవబోధనే ధాతువుపై లఙ్ ప్రథమపురుషైకవచనం); కాల... న్వితమ్ : కాల దండ = యమదండాలయొక్క, శత = వందలతో, సంకాశ = సమానమైన, కార్ముక = వింటియొక్కయు, శర = బాణాలయొక్కయు, అంక = గుర్తులతో / మచ్చలతో, అన్వితమ్ = కూడియున్న; తామ్ = ఆ; హరిమ్ = నారాయణుని; భజ = సేవించు (భజ సేవాయాం ధాతువుపై లోట్ మధ్యమపురుషైకవచనం).

**తాత్పర్యం :** హుంకారపూర్వకమైన శ్రీరాముని ధనుష్టంకారాన్ని విని లంకానగరం పర్వతాలపై నిశ్శంకగా పడుతున్న వజ్రాయుధంలాగా దాన్ని భావించింది. వందల అనుమానాలతో కలతపడిన బుద్ధితో దాన్ని శ్రీరాముడు కాళరాత్రిలా భావించాడు. వందల యమదండాలతో సమానమైన ఆ కార్ముకంతో, బాణాలతో కూడిన ఆ గుర్తులు గల నారాయణుని సేవించండి.

**విశేషాలు :** 1) శ్రీరాముని ధనుష్టంకారధ్వనిని – శివధనుస్సును విరిచిన సందర్భంలో – వామనుడుదాహరించిన ఈ శ్లోకం అద్భుతంగా వర్ణిస్తుంది లక్ష్మణుని భావనగా–

శ్లో॥ దోర్దండాంచితచంద్రశేఖర ధనుర్దండావభంగోత్థిత–
ష్టంకారధ్వనిరార్యబాలచరితప్రస్తావనాడిండిమః ।
ద్రాక్పర్యస్తకపాలసంపుటమిత బ్రహ్మాండభాండోదర
భ్రామ్యత్పిండితచండిమా కథమహో నాద్యాపి విశ్రామ్యతి ॥

చెవుల్లో గింగిర్లు తిరుగుతున్న ఆ టంకారధ్వని బాలచరితప్రస్తావన మాత్రమే. అయితే రావణునితో పోరాటానికై హుంకారపూర్వకంగా చేసిన ఆ ధనుష్టంకారం వజ్రపాతంలాగా కనిపించటం, కాళరాత్రిలా అనిపించటం హేతుబద్ధమే.

**2) శంకాశతా....**

రావణుడు రామబాణానికి బెదిరిపోయిన తరువాత తనకు గతంలో వివిధ వ్యక్తులద్వారా కలిగిన శాపాలనూ, తన బాలాహంకారంచేత మానవులశక్తిని పరిగణించకపోవటం వంటివన్నీ గుర్తుతెచ్చుకొని కలతకు గురి అయ్యాడు. తన భావాలను కొలువులో తనవారితో పంచుకొన్నాడు. ఇలా...

శ్లో॥ సర్వం తత్ఖలు మే మోఘం యత్తప్తం పరమం తపః ।
యత్సమానో మహేంద్రేణ మానుషేణ వినిర్జితః ॥

శ్లో॥ ఇదం తద్బ్రహ్మణో ఘోరం వాక్యం మామభ్యుపస్థితమ్ ।
మానుషేభ్యో విజానీహి భయం త్వమితి తత్తథా ॥

శ్లో॥ దేవదానవగన్ధర్వైః యక్షరాక్షసపన్నగైః ।
అవధ్యత్వం మయా ప్రోక్తం మానుషేభ్యో న యాచితమ్ ॥

శ్లో॥ **తమిమం మానుషం మన్యే** రామం దశరథాత్మజమ్ ।
ఇక్ష్వాకు కులనాథేన అనరణ్యేన యత్పురా ॥

శ్లో॥ ఉత్పత్స్యతి హి మద్వంశపురుషో రాక్షసాధమ ।
యస్త్వాం సపుత్రం సామాత్యం సబలం సాశ్వసారథిమ్ ॥

శ్లో॥ నిహనిష్యతి సంగ్రామే త్వాం కులాధమ దుర్మతే ।
శప్తోఽహం వేదవత్యా చ యథా సా ధర్షితా పురా ॥

శ్లో॥ సేయం సీతా మహాభాగా జాతా జనకనన్దినీ ।
ఉమా నన్దీశ్వరశ్చాపి రమ్భా వరుణకన్యకా ॥
యథోక్తాస్తన్మయా ప్రాప్తం **న మిథ్యా ఋషిభాషితమ్** । – రామా–యుద్ధ, 60/5–12



**శ్లో॥ ధీమానమేయతనుధామాఽఽర్తమఙ్గళదనామా రమాకమలభూ-**
**కామారిపన్నగపకామాహివైరిగురుసోమాదివన్ద్యమహిమా ।**
**స్థేమాదినాఽపగతసీమాఽవతాత్సఖలసామాజరావణరిపూ**
**రామాభిధో హరిరభౌమాకృతిః ప్రతనసామాదివేదవిషయః ॥ 21**

**అవతారిక :** శ్రీరామమహిమావర్ణనమే.

**అన్వయక్రమం :** ధీమాన్ అమేయ – తను – ధామా ఆర్త – మంగళద – నామా రమా – కమలభూ – కామ+అరి – పన్నగ – కామ – అహివైరి – గురు – సోమ + ఆది – వన్ద్య – మహిమా స్థేమ + ఆదినా అపగత – సీమా సఖల – సామాజ – రావణ – రిపుః ప్రతన – సామ + ఆది – వేద – విషయః రామ + అభిధః అభౌమ + ఆకృతిః హరిః అవతాత్.

**ప్రతిపదార్థం :** ధీమాన్ = బుద్ధిమంతుడును (ధీః అస్య అస్తీతి ధీమాన్); అమేయ... ధామా : అమేయ = కొలతకందని, తను = శరీరంయొక్క, ధామా = కాంతిగలవాడునూ (పతత్యధో ధామ విసారి సర్వతః కిమేతదిత్యాకులమీక్షితం జనైః – శిశుపాలవధమ్) లేదా అమేయ = కొలవరాని, తను = శరీరమే, ధామా = గృహంగా గలవాడు / స్వస్వరూపుడు; ఆర్త... నామా : ఆర్త = దీనులకు, మంగళద = శుభకరమైన, నామా = పేరు గలవాడూ; రమా... మహిమా : రమా = లక్ష్మి, కమలభూ = తామరయందు పుట్టినవాడు / బ్రహ్మ, కామ + అరి = మదనుని శత్రువైన శివుడూ, పన్నగప = ఆదిశేషువూ, కామ = మదనుడూ, అహి–వైరి = పాములకు శత్రువైన గరుత్మంతుడూ, గురు = బృహస్పతీ, సోమ = చంద్రుడు, ఆది = మొదలగువారిచే, వంద్య = నమస్కరింపదగిన, మహిమా = ప్రభావం గలవాడూ; స్థేమ + ఆదినా = బలం / స్థైర్యం మొదలగు గుణాలచే; అపగత – సీమా = తొలగింపబడిన హద్దులు గలవాడూ / హద్దులెరుగని బలస్థైర్యాలు గలవాడూ; సఖల... రిపుః : సఖల = చెడ్డవారితో గూడిన, సామాజ = సమాజంగల (ఇక్కడ సమాజశబ్దం మీద స్వార్థంలోనే అణ్ ప్రత్యయం), రావణ = దశగ్రీవుడు, రిపుః = శత్రువుగా

గలవాడూ; ప్రతన... విషయః: ప్రతన = పురాతనమైన, సామ + ఆది = సామం మొదలుగాగల, వేద = శ్రుతులకు, విషయః = విషయమైనవాడు / వర్ణింపవలసిన అంశమైనవాడూ; రామ + అభిధః = రాముడను పేరుగలవాడూ; అభౌమ + ఆకృతిః = అపార్థివరూపుడైన; హరిః = నారాయణుడు; అవతాత్ = రక్షించుగాత (అవ రక్షణాదిషు ధాతువుపై లోట్ ప్రథమపురుషైకవచనం).

**తాత్పర్యం :** ధీమంతుడూ; కొలతలకందని రూపవంతుడూ; లక్ష్మి, బ్రహ్మ, శివుడు, శేషుడు, మదనుడు, గరుడుడు, గురుడు, చంద్రుడు – వీరిచే నమస్కరింపదగిన ప్రభావం గలవాడూ, దీనులకు శుభాలను అందించే దివ్యనాముడూ; తన చుట్టూ చెడ్డవారిని నిలుపుకొన్న రావణుడు శత్రువుగా గలవాడూ; సామాది వేదవిషయమైనవాడూ; రాముడను పేరుగలవాడూ; అపార్థివరూపుడైన హరి కాపాడుగాత!

**విశేషాలు :**

**1. ఆర్తమంగళదనామా :** దశావతారస్తుతిగీతం 'నామస్మరణాదన్యోపాయం న హి పశ్యామి' అంటూ దశావతారాలను కీర్తిస్తుంది. వాటిలో రామావతారం కూడా ఒకటి.

శ్లో॥ సీతావల్లభ దాశరథే దశరథనందన లోకగురో
రావణమర్దన రామ నమో భక్తం తే పరిపాలయ మామ్ ।
నామస్మరణాదన్యోపాయం నహి పశ్యామో భవతరణే
రామ హరే కృష్ణ హరే తవ నామ వదామి సదా నృహరే ॥

ఇక్కడ దాశరథి, దశరథనందన పదాలు సమానార్థకాలు. అయితే ఇది నామస్మరణప్రధానం కాబట్టి పునరుక్తమయితే పునస్స్మృతమయినట్లే.

**2. సామాదివేద :** ఋగాదివేదపరిగణనం ప్రసిద్ధం. ఇక్కడ సామాదివేదమనటం హేతుబద్ధమే. వేదదర్శనానికి ముందు కూడా భావుకులు రమణీయభావదర్శనంచేసి వుంటారు. భావం లయాత్మక మయితేనే అందం. లయాత్మకమైన భావం లయాత్మకమైన భాషను ఎంచుకొంటుంది. ఆ తరువాత ఋగాదివేదదర్శనాన్ని కూడా శ్రుతిలయానుగుణంగా ఆవిష్కరించారు. ఉదాత్తానుదాత్తస్వరితాలు శ్రుతిని నియన్త్రిస్తే ప్లుతాదికాలగతి లయను నియంత్రిస్తుంది. శ్రుతి పక్వం శ్రుతి అయితే లయపక్వం సామమైంది. కాబట్టి సామాదివేదాలనటంలో సామపదం లయకు ఉపలక్షకం. అది పురాతనం అధునాతనం కూడా.

**3. శ్రీరామస్థేమం :** శ్రీరాముని స్థైర్యాన్ని (గాంభీర్యాన్ని) వ్యక్తపరిచే ప్రసిద్ధశ్లోక మిదిగో–

శ్లో॥ ఆహూతస్యాభిషేకాయ విసృష్టస్య వనాయ చ ।
న మయా లక్షితస్తస్య స్వల్పోఽప్యకారవిభ్రమః ॥

అభిషేకమని ఆహ్వానించిన సమయంలోనూ, వనాలకు వెళ్ళాలని ఆదేశించి పంపుతున్న సమయంలోనూ రాముని ఆకారవికారాలలో ఏవిధమైన మార్పు లేదట. ఆ స్థితినే మునిత్వంగా చెప్తుంది భగవద్గీత.



శ్లో॥ దోషాత్మభూవశతురాషాడతిక్రమజదోషాత్మభర్తృవచసా
పాషాణభూతమునియోషావరాత్మతనువేషాదిదాయిచరణః ।
నైషాదయోషిదశుభేషాకృదణ్డజనిదోషాచరాదిశుభదో
దోషాగ్రజన్మమృతిశోషాపహోऽవతు సుదోషాంఘ్రిజాతహననాత్ ॥ 22

**అవతారిక :** శ్రీరామవైభవవర్ణనమే అహల్యాది జనసముద్ధరణ వర్ణనతో.

**అన్వయక్రమం :** దోష + ఆత్మభూ - వశ - తురాషాడ్(ట్) - అతిక్రమ - జ - దోష + ఆత్మ - భర్తృ - వచసా పాషాణ - భూత - ముని - యోషా - వర + ఆత్మ - తను - వేష + ఆది - దాయి - చరణః నైషాద - యోషిద్(త్) - అశుభ + ఈషా కృద్(త్) - అండజని - దోషా చర + ఆది - శుభదః సుదోష + అంఘ్రిజాత - హననాత్ దోష + అగ్రజన్మ - మృతి - శోష + అపహః అవతు.

**ప్రతిపదార్థం :** దోషా... వచసా : దోష = కలుషమైన, ఆత్మభూ = మదనునకు (మకరధ్వజ ఆత్మభూః - అమరకోశం), వశ = లోనైన, తురాషాట్ = ఇంద్రునితో/యొక్క (మహేన్ద్రో బాహుదన్తేయ స్తురాషాట్... వైజయన్తీకోశం. తురం సహతే ఇతి తురాషాట్), అతిక్రమ = (కామవిషయకంగా) హద్దుమీరుటచేత, జ = పుట్టిన, దోష = తప్పువలన, ఆత్మ = తన (అహల్య)యొక్క; భర్తృ = మగని (గౌతముని)యొక్క, వచసా = మాట (శాపం)తో; పాషాణ... చరణః : పాషాణ-భూత్ = రాయిగా నిలిచిన, ముని-యోషా = మహర్షి భార్యకు, వర = శ్రేష్ఠమైన, ఆత్మ = మనస్సును, తను = శరీరాన్నీ, వేష+ఆది = ఆహార్యాన్నీ, ఆభరణాదులను, దాయి = ఇచ్చిన, చరణః = పాదంగలవాడు, (జరిగిన తప్పునకు తొలికారణం మనస్సు. అందుకే ముందు మంచి మనస్సును, ఆపై శరీరవేషాదులను కల్పించటం); నైషాద... దః : నైషాద = బోయజాతికి చెందిన, యోషిత్ = స్త్రీకీ (శబరికి), అశుభ = అమంగళకరమైన, ఈషా = హింసను (ఈష్ ధాతువునుండి 'ఈహా' లాగా) కృత్ = చేస్తున్న, అండజని = పక్షికీ (కాకాసురునికీ), దోషా-చర = నిశాచరుడైన రాక్షసునికీ (విభీషణునికీ) (దోషా చ నక్తం చ రాజనౌ - అమరకోశం. రాత్రియందు అనే అర్థంలో దోషాపదం అవ్యయం), ఆది = మొదలగువారికి, శుభ-దః = శుభాన్ని ఇచ్చినవాడు; సుదోషా... హననాత్ : సుదోష = తీవ్రమైన తప్పుగల, అంఘ్రిజాత = శూద్రునియొక్క (శంబూకుడు) (పద్భ్యాగ్ం శూద్రో అజాయత - పురుషసూక్తం), హననాత్ = సంహరణం ద్వారా; దోషా.... షాపహః : దోష = (అన్య) దోషం వలన కలిగిన, అగ్ర-జన్మ = బ్రాహ్మణునియొక్క, మృతి = మరణమనే, శోష = సొక్కును, అప-హః = పోగొట్టినవాడును అగు శ్రీరాముడు; అవతు = రక్షించును గాక! (అవ రక్షణే ధాతువుపై లోట్ ప్రథమపురుషైకవచనం).

**తాత్పర్యం :** ఇంద్రుడు మదనపరవశుడయ్యాడు. గౌతముని పత్ని అయిన అహల్యను కామించాడు. ఆమె కూడా ధర్మాతిక్రమణం చేసి ఇంద్రుని కోరిక తీరటంలో భాగస్వామిని అయింది. గౌతముడు అది గ్రహించి ఆమెను శాపంతో శిలను చేశాడు. ఆ శిలకు శ్రీరాముడు తన పాదస్పర్శతో గొప్ప మనస్సునూ, మంచి రూపాన్నీ, ఆహార్యాభరణాదులను అందించాడు. నిషాదస్త్రీ అయిన శబరిని, అశుభదృష్టితో సీతను హింసించిన కాకాసురునీ, రావణసోదరుడు, నిశాచరుడైన విభీషణునీ

శుభాస్పదులను చేశాడు. అర్హత లేని శంబూకుని తపస్సు కారణంగా మరణించిన బ్రాహ్మణబాలకుని పునరుజ్జీవితుని చేశాడు. అటువంటి శ్రీరాముడు కాపాడుగాత!

**విశేషాలు :** అహల్యాశాపం – వాల్మీకి రామాయణం మేరకు గౌతముడు అహల్యను శపించిన తీరు ఇది –

శ్లో॥ ..............
ఇహ వర్షసహస్రాణి బహూని నివసిష్యసి ॥

శ్లో॥ వాతభక్షా నిరాహారా తప్యన్తీ భస్మశాయినీ ।
అదృశ్యా సర్వభూతానామాశ్రమేఽస్మిన్ వసిష్యసి ॥

శ్లో॥ యదా త్వేతద్వనం ఘోరం రామో దశరథాత్మజః ।
ఆగమిష్యతి దుర్ధర్ష స్తదా పూతా భవిష్యసి ॥

శ్లో॥ తస్యాతిథ్యేన దుర్వృత్తే లోభమోహవివర్జితా ।
మత్సకాశం ముదా యుక్తా త్వం వపుర్ధారయిష్యసి ॥ – బాల – 48/29–32

'ఏ ప్రాణులకూ కనిపించకుండా నివసిస్తావు' అని వాల్మీకి మాట. దాన్ని వ్యాఖ్యాతలు "అదృశ్యా ఇత్యస్య స్వరూపేణ అదృశ్యా. శిలా ప్రతిమ రూపేణ సర్వదృశ్యా" (తిలకవ్యాఖ్య) అని వివరించారు. పద్మపురాణంలో శాపంవల్ల శిలగా మారిందని ప్రకటించింది.

శ్లో॥ శాపదగ్ధా పురా భర్త్రా రామ శక్రాపరాధతః ।
అహల్యాఖ్యా శిలా జజ్ఞే శతలింగః కృతః స్వరాట్ ॥

**2. శబరి :** రామాయణంలోని అరణ్యకాండలో శబరి వృత్తాంత ముంటుంది. శ్రీరాముని అనుమతితో శబరి అగ్నికి తనను తాను సమర్పించుకొని స్వర్గానికి చేరుతుంది.

శ్లో॥ తామువాచ తతో రామః శబరీం సంశితవ్రతామ్ ।
అర్చితోఽహం త్వయా భక్త్యా గచ్ఛ కామం యథాసుఖమ్ ॥

శ్లో॥ ఇత్యుక్త్వా జటిలా వృద్ధా చీరకృష్ణాజినాంబరా ।
తస్మిన్ ముహూర్తే శబరీ దేహం జీర్ణం జిహాసతీ ॥

శ్లో॥ అనుజ్ఞాతా తు రామేణ హుత్వాత్మానం హుతాశనే ।
జ్వలత్పావకసంకాశా స్వర్గమేవ జగామ సా ॥ – అరణ్యకాండ 74/ 31–33

**3. కాకాసురవృత్తాంతం :** కాకాసురవృత్తాంతం అరణ్యంలో సీతారాములు నివసిస్తున్నప్పుడు జరిగినా దీని ప్రస్తావన సుందరకాండలో కనిపిస్తుంది. 38వ సర్గలో సీత అభిజ్ఞానంగా ఆంజనేయుని ద్వారా రామునకు పంపిన సందేశభాగమిది. సీతపై నిష్కారణంగా, అశుభకరంగా దాడిచేసిన కాకాసురునిపై శ్రీరాముడు దర్భను మంత్రించి బ్రహ్మాస్త్రప్రయోగం చేయటం, ఆ కాకాసురుడు అంతటా తిరిగి కడకు

రామునే శరణుకోరటం ఈ కథలో విశేషం. బ్రహ్మాస్త్రం వ్యర్థం కాకూడదు కాబట్టి కాకి కుడికంటిని మాత్రమే దానికి బలిచేయటమీకథ.

**4. విభీషణసమాశ్రయణం,** రాజ్యలాభం అందరూ ఎరిగినదే.

**5. శంబూకవధ :** రామాయణం ఉత్తరకాండలోనిదిది. ప్రక్షిప్తంగా కొందరి భావన. అసలు ఉత్తరకాండమే వాల్మీకి రచన కాదన్నది కొందరు విమర్శకుల తలంపు.

తపస్సు చేయటానికి అర్హత లేని శంబూకుడు తపస్సు చేస్తుంటే ఒక బ్రాహ్మణుని కుమారుడు చనిపోవటం, ఆ తండ్రి అది రాజదోషమే అనటం, శ్రీరాముడు దానిని అంగీకరించటం ప్రతిక్రియ చేయటమిక్కడ కథ.

కథాభాగంలోని వివిధవిమర్శనాంశాలను ప్రక్కన పెడితే అధర్మం జరిగితే రాజ్యంలో, దానికి రాజే కారకుడన్న దానిని శ్రీరాముడు అంగీకరించటం నేటి ప్రజానాయకులు ఆదర్శంగా స్వీకరించవలసిన అంశం.

ఈ శ్లోకంతో రామావతారస్తుతి ముగిసింది.



**శ్లో॥ బృన్దావనస్థపశువృన్దావనం వినుతవృన్దారకైకశరణం**
**నన్దాత్మజం నిహతనిన్దాకృదాసురజనం దామబద్ధజఠరమ్ ।**
**వన్దామహే వయమమన్దావదాతరుచిమన్దాక్షకారివదనం**
**కున్దాలిదన్తముత కన్దాసితప్రభుతనుం దావరాక్షసహరమ్ ॥ 23**

**అవతారిక :** కృష్ణావతారస్తుతి. కృష్ణరూపంలో శ్రీహరి ప్రదర్శించిన కతిపయచేష్టావర్ణనం.

**అన్వయక్రమం :** బృందా-వన-స్థ-పశు-వృంద + అవనమ్ వినుత - బృందారక + ఏక - శరణమ్ నిహత - నిందా - కృద్(త్) - ఆసుర - జనమ్ దామ - బద్ధ - జఠరమ్ అమంద + అవదాత - రుచి - మందాక్ష - కారి - వదనమ్ కుంద + ఆలి - దంతమ్ కంద + అసిత - ప్రభు - తనుమ్ దావ - రాక్షస - హరమ్ నంద + ఆత్మజం వయమ్ వందామహే ఉత.

**ప్రతిపదార్థం :** బృందా... వనమ్ : బృందావన = బృందావనమునందు, స్థ = ఉన్నట్టి, పశు = పశువులయొక్క / ప్రాణులయొక్క, బృంద = సమూహానికి, అవనమ్ = రక్షకుడూ; వినుత... శరణమ్ : వినుత = స్తుతించిన, బృందారక = దేవతలకు (బృందారకాదైవతాని పుంసి వా దేవతాః స్త్రియామ్ - అమరకోశం), ఏక - శరణమ్ = ఒకే దిక్కుగా వున్నవాడూ; నిహత... జనమ్ : నిహత - నిందా - కృత్ = (తనను) దూషించిన, ఆసుర - జనమ్ = రాక్షసజనం గలవాడూ (అసురః ఏవ ఆసురః - **'ప్రజ్ఞాదిభ్యశ్చ'** - అని అణ్ ప్రత్యయం); దామ... జఠరమ్ : దామ = త్రాటితో, బద్ధ = కట్టబడిన, జఠరమ్ = పొట్టగలవాడూ (అందుకే కృష్ణుడు / నారాయణుడు దామోదరుడు); అమందా... వదనమ్: అమంద = మిక్కుటంగా, అవదాత = తెల్లనైన (అవదాతస్సితే పీతే శుద్ధే - అమరకోశం), రుచి = కాంతితో, మందాక్ష = సిగ్గును, కారి = కలిగించే, వదనమ్ = మోము గలవాడూ; కుంద +

అలి = మొల్లలవరుసవంటి, దంతమ్ = పళ్ళు గలవాడూ; కందా... తనుమ్ : కంద = మేఘంవంటి, అసిత = తెల్లనైన, ప్రభు = విశాలమైన, తనుమ్ = శరీరం గలవాడూ; దావ-రాక్షస = దావాగ్నిరూపమైన రాక్షసుని, హరమ్ = సంహరించినవాడూ అయిన; నంద + ఆత్మజమ్ = నందకుమారుని; వయమ్ = మేము; వన్దామహే = నమస్కరిస్తున్నాము / స్తుతిస్తున్నాము (వది అభివాదనస్తుత్యోః ధాతువుపై ఉత్తమపురుషబహువచనమ్)

**తాత్పర్యం :** బృందావనంలోని పశువులకు పాలకుడు కృష్ణుడు. దేవతల నుతులనంది వారికి శరణమిచ్చువాడు కృష్ణుడు. తనను నిందించిన లేదా చులకనగా చూసి వంచింప నెంచిన రాక్షసులను సంహరించినవాడు తాను. యశోదచే తన పొట్టకు తాడు గట్టబడిన వాడూ, తెల్లని వెలుగులుగల వదనంలో సిగ్గులు చిందింపజేసేవాడు. తెల్లని మొల్లలవంటి పలువరుస, నీలిమేఘంవంటి విశాలమైన శరీరం గలవాడు. దావాగ్నిరూపుడైన రాక్షసుని సంహరించినవాడు కృష్ణుడు.

**విశేషాలు :** 1) వినుతబృందారకరక్షకుడు కృష్ణుడు. అవతారకారణమే అది. భాగవతం దశమస్కంధం ప్రారంభంలోనే జనభారమెక్కువై (దృప్తనరపాలరాక్షసభారం) బ్రహ్మ శివునితో కలిసి వెళ్ళి నారాయణుని ప్రార్థించటం, నారాయణుడు తాను కృష్ణుడుగా అవతరించి ఆ భారాన్ని పోగొడతానని చెప్పటం కనిపిస్తుంది.

శ్లో॥ భూమి**దృప్తనృపవ్యాజదైత్యానీకశతాయుతైః** ।
**ఆక్రాంతా భూరిభారేణ** బ్రహ్మాణం శరణం యయౌ ॥ ...

శ్లో॥ బ్రహ్మా తదుపధార్యాథ సహ దేవైస్తయా సహ ।
జగామ సత్రిణయనస్తీరం క్షీరపయోనిధేః ॥

శ్లో॥ తత్ర గత్వా జగన్నాథం దేవదేవం వృషాకపిమ్ ।
పురుషం పురుషసూక్తేన ఉపతస్థే సమాహితః ॥

2. బ్రహ్మ గోవత్సాలను గోపాలకులతో సహా అంతర్ధానం చేసినప్పుడూ, ఇంద్రుడు ఇంద్రోత్సవాన్ని జరపలేదన్న కోపంతో జోరున వాన కురిపించినప్పుడూ (గోవర్ధనమెత్తి) బృందావనంలోని పశుసంపదను కాపాడినవాడు కృష్ణుడే. తనను సంహరించటానికి వచ్చిన వివిధ రాక్షసులను వినోదప్రాయంగా సంహరించినవాడు కృష్ణుడే. ఆత్మరక్షణతో పాటు గోకులరక్షణకూడా చేశాడు.

కృష్ణుడు యశోద తనను త్రాటితో బంధించినపుడు దామోదరుడై "తొల్లి నారదు శాపంబున నిరుమద్దులైయున్న నలకూబర మణిగ్రీవులను గుహ్యకుల నిద్దఱంగని, ఱోలీడ్చుకొని చనియె" (భాగవతం – పోతన). గో గోప గోపికా సంఘాన్ని కార్చిచ్చు చుట్టుకొన్నప్పుడు ఆ దావదహనాన్ని పానంచేసి వారిని కాపాడాడు. భాగవతం దావాగ్నిని దావాగ్నిగానే వివరించింది. ప్రకృతస్తుతిలో దావాగ్నిలో కూడా రాక్షసత్వారోపణ ఉంది.

ఇలా కృష్ణుడు తన అనంతసత్త్వసంపన్నతను ప్రదర్శించినందువలననే బ్రహ్మ కూడా కృష్ణుని ఇలా స్తుతించాడు –

ఏలా బ్రహ్మపదంబు? వేదములకున్ వీక్షింపగా రానిని
న్నీ లోకంబున నీ వనాంతరమునందీమందలోఁగృష్ణయం
చాలాపాది సమస్తభావములు నీయందే సమర్పించు నీ
వ్రేలందొక్కని పాదరేణువులు పై వేష్టించినంజాలదే!



**శ్లో॥ గోపాలకోత్సవకృతాపారభక్ష్యరససూపాన్నలోపకుపితా-**
**శాపాలయాపితలయాపాంబుదాలి సలిలాపాయధారితగిరే! ।**
**స్వాపాఙ్గదర్శనజతాపాఙ్గరాగయుతగోపాఙ్గనాంశుకహృతి-**
**వ్యాపారశౌణ్డ! వివిధాపాయతస్త్వమవ గోపారిజాతహరణ! ॥ 24**

**అవతారిక :** కృష్ణావతారప్రస్తుతికే కొనసాగింపు

**అన్వయక్రమం :** గోపాలక + ఉత్సవ - కృత + అపార - భక్ష్య - రస - సూప + అన్న - లోప - కుపిత + ఆశా - పాల - యాపిత - లయ + ఆప + అంబుద + ఆలి - సలిల - అపాయ - ధారిత - గిరే! స్వ + అపాంగ - దర్శన - జ - తాప + అంగరాగ - యుత - గోప + అంగనా + అంశుక - హృతి - వ్యాపార - శౌండ! గో - పారిజాత - హరణ! (గోప + అరి - జాత - హరణ) వివిధ + అపాయతః త్వమ్ అవ.

**ప్రతిపదార్థం :** గో-పాలక = గోపాలకులయొక్క, ఉత్సవ = పండుగయందు, కృత = చేయబడిన, అపార = అంతులేని, భక్ష్య = తినుబండాలు, రస = పానీయాలు, సూప = పప్పు, అన్న = అన్నం - మొదలగు వానియొక్క (ఆహారపదార్థాలు భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య, పానీయాలని అయిదు రకాలు. 'అన్నం చతుర్విధమ్' అని గీతావచనం) లోప = కనిపించకుండుటచేత, కుపిత = కోపానికి లోనైన, ఆశా-పాల = దిక్పాలకుడైన ఇంద్రునిచేత, యాపిత = పంపబడిన, లయ = ప్రళయకాలమందలి, ఆప = నీరుగల, అంబు-ద = మేఘాలయొక్క, ఆలి = సమూహంవల్ల కురిసిన, సలిల = నీటిని, అపాయ = తొలగించుటకై, ధారిత = ధరింపబడిన, గిరే! = (గోవర్ధన) పర్వతం గలవాడా!; స్వ = తనయొక్క, అపాంగ = కడగంటిచూపుతో, దర్శన = చూచుటవలన, జ = కలిగిన, తాప = తాపంవలన అలదిన, అంగరాగ = సుగంధలేపనాలతో, యుత = కూడియున్న, గోప+అంగనా = గోపకాంతలయొక్క, అంశుక = వస్త్రాలయొక్క, హృతి = అపహరణమనే, వ్యాపార = పనియందు, శౌండ! = నేర్పుగలవాడా!; గో = కాంతిమంతమైన, పారిజాత = దేవతావృక్షమైన పారిజాతాన్ని, హరణ = అపహరించినవాడా! (గోప = గోపాలకులకు, అరి = శత్రువులయొక్క, జాత = సమూహాన్ని, హరణ = సంహరించినవాడా!); వివిధ = అనేక రీతులయిన, అపాయతః = కష్టాలనుండి; త్వమ్ = నీవు; అవ = కాపాడు (అవ రక్షణే ధాతువుపై లోట్ మధ్యమ పురుషైకవచనం).

**తాత్పర్యం :** గోకులంలో ఇంద్రోత్సవం జరిపేవారు. దానికై భక్ష్యాలనూ, రసాలనూ, అన్నాన్ని, పప్పును అపరిమితంగా సిద్ధం చేసేవారు. అయితే కృష్ణుడు వారించినందువల్ల ఆ ఇంద్రోత్సవం ఆగి, ఇంద్రునకు ఎప్పుడూ నివేదింపబడే అవి దక్కలేదు. అది ఇంద్రుని కోపానికి కారణమైంది.

దానితో ప్రళయకాలమేఘాలను గోకులంమీదకు పంపాడు. అవి కురిసిన నీటినుండి గో గోపాలకులను కాపాడటానికై గోవర్ధనగిరిని పైకెత్తి పట్టుకొన్న వాడవు నీవు. నీ కడగంటిచూపుతో తాపాన్ని పొంది, తచ్ఛాంతికై అంగరాగాలను అలదుకొన్న గోపకాంతల వస్త్రాలను అపహరించటంలో నేర్పు గలవాడవు నీవు. కాంతిమంతమైన పారిజాతవృక్షాన్నీ, గోపుల శత్రుసమూహాలనూ సంహరించినవాడవు నీవు. వివిధాపాయాలనుండి కాపాడవలసింది.

**విశేషాలు :** ఇంద్రోత్సవ విఘాతాన్నీ, గోవర్ధనోద్ధరణాన్నీ శ్రీమద్భాగవతం దశమస్కంధంలో (24, 25 అధ్యాయాలు) చక్కగా వివరించారు వ్యాసమహర్షి.

వేదాలలో ఇంద్రుడు ప్రధానదేవతగా కనిపిస్తాడు. పురాణకాలానికి ఆ ఇంద్రప్రభ మసకబారినట్లు కనిపిస్తుంది. ఉపేంద్రశక్తిమీద పూర్తిగా ఆధారపడినవానిగా ఇంద్రుని తీర్చాయి పురాణాలు. ఆ క్రమంలోనే కృష్ణుడు ఇంద్రోత్సవాన్ని వ్యతిరేకించటం. ఇంద్రుడు కోపించినా కలిగే నష్టమేదీ లేదంటున్న కృష్ణవచనాలు గమనించండి.

కోపింపన్ బనిలదు శక్రునికిఁదాఁ గోపించుఁగాకేమి సం
క్షేపంబయ్యెడి దేమి పట్టణములున్ గేహంబులున్ దేశముల్
వ్యాపారంబులు మీకుఁ బోయెడినె? శైలారణ్యభాగంబులన్
గోపత్వంబున నుండుచున్ మనకు సంకోచింపఁగా నేటికిన్.

– పోతనభాగవతము 10/885

అంతగా గోపకులాన్ని ఇంద్రునికి వ్యతిరేకంగా ఆలోచింపజేశాడు కాబట్టి ఇంద్రుని కోపంనుండీ కూడా వారిని కాపాడాడు గోవర్ధనగిరినెత్తి. అంతే స్థాయిలో వారికి నమ్మకాన్ని కలిగిస్తున్న తీరు ఇది –

బాలుండీతఁడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపఁగా
జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁబోల దీ
శైలాంభోనిధి జంతుసంయుతధరాచక్రంబు పైఁబడ్డ నా
కేలల్లాడదు బంధులార! నిలుఁడీ క్రిందన్ బ్రమోదంబునన్.

– పోతనభాగవతము 10/918

గోపకాంతల కాత్యాయనీవ్రతాన్ని గమనించి, జలక్రీడల సందర్భంలో వారి వలువలను అపహరించి, వారి సిగ్గు పోగొట్టి కడగా వారితో పలుకుతున్న మాటలు చూడండి.

శ్లో॥ సంకల్పో విదితః సాధ్వ్యో భవతీనాం మదర్చనమ్ ।
మయానుమోదితః సోఽసౌ సత్యో భవితుమర్హతి ॥

శ్లో॥ న మయ్యావేశితధియాం కామః కామాయ కల్పతే ।
భర్జితా క్వథితా ధానాః ప్రాయో బీజాయ నేష్యతే ॥ – భాగవతమ్ 10/22/25,26

'కామః కామాయ న కల్పితే' – కామం కామంకోసం కాదు. కేవలం ముక్తికోసమే. మధురభక్తిలో ప్రధానమైన అంశమిది. వినిపించేది కామమైనా ధ్వనించేది మోక్షం.

పారిజాతాపహరణం – స్వర్గంనుండి – సత్యభామ సంతృప్తికోసం. గోపశత్రు సంహరణం ఆశ్రితోద్ధరణం కోసం. రెండూ ప్రసిద్ధవిషయాలే.



**శ్లో॥ కంసాదికాసదవతంసావనీపతివిహింసాకృతాత్మజనుషం**
**సంసారభూతమిహ సంసారబద్ధమనసం సారచిత్సుఖతనుమ్ ।**
**సంసాధయన్తమనిశం సాత్త్వికవ్రజమహం సాదరం బత భజే**
**హంసాదితాపసరిరంసాస్పదం పరమహంసాదివన్ద్యచరణమ్ ॥ 25**

**అవతారిక :** శ్రీకృష్ణావతారస్తుతియే.

**అన్వయక్రమం :** ఇహ కంస + ఆదిక – అసద్ – అవతంస + అవనీపతి – విహింసా – కృత + ఆత్మ – జనుషమ్ సంసార – భూతం సంసారబద్ధ – మనసమ్ సార – చిత్ – సుఖ – తనుమ్ అనిశమ్ సాత్త్విక – వ్రజమ్ సంసాధయన్తమ్ హంస + ఆది – తాపస – రిరంసా + ఆస్పదమ్ పరమహంస + ఆది – వన్ద్య – చరణమ్ అహం సాదరం భజే బత!

**ప్రతిపదార్థం :** ఇహ = ఈ లోకంలో; కంస + ఆదిక = కంసుడు మొదలుగాగల, అసత్ = చెడ్డతనమే, అవతంస = శిరోభూషణముగా గల (పుంస్యుత్తంసావతంసౌ ద్వౌ – అమరకోశం), అవనీ–పతి = రాజులను, విహింసా = తీవ్రంగా హింసించటానికై, కృత = స్వీకరించిన / సిద్ధపరుపబడిన, ఆత్మ = తనయొక్క, జనుషమ్ = పుట్టువు గలవాడూ (జనుర్జనన జన్మాని – వైజయన్తీకోశం); సంసార (సమ్+సార) = శ్రేష్ఠుడుగా, భూతమ్ = నిలిచినవాడూ (సారోబలే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబం వరే త్రిషు – అమరకోశం); సంసార... మనసమ్ : సంసార = లోకులయందు, బద్ధ = బంధింపబడిన, మనసమ్ = మనస్సు గలవాడూ; సార... సుఖమ్ : సార = స్థిరమైన, చిత్ = జ్ఞానరూపమైన, సుఖ = సుఖమనే / ఆనందమనే, తనుమ్ = శరీరం గలవాడు (రసో వై సః రసగ్గ్ హ్యేవాయం – తైత్తిరీయోపనిషత్తు); అనిశమ్ = ఎల్లప్పుడూ; సాత్త్విక–వ్రజమ్ = సాత్త్వికుల సముదాయాన్ని; సంసాధయన్తమ్ = సిద్ధి పొందింపజేయువాడు; హంసాది... స్పదమ్ : హంస + ఆది = హంసుడు మొదలుగా గల, తాపస = మునులయొక్క, రిరంసా = క్రీడాసక్తికి (రన్తుమ్ ఇచ్ఛా రిరంసా), ఆస్పదమ్ = ఆధారమైనవాడూ; పరమ... చరణమ్ : పరమ – హంస + ఆది = పరమహంసుడు మొదలగువారిచే, వన్ద్య = నమస్కరింపదగిన, చరణమ్ = పాదాలు గలవాడూ అయిన కృష్ణుని; అహమ్ = నేను, భజే = సేవిస్తున్నాను. (భజ సేవాయాం ధాతువుపై లట్ ఉత్తమపురుషైకవచనం); బత = ఆహా!

**తాత్పర్యం :** కృష్ణావతారం కంసుడు మొదలుగాగల దుర్మార్గులైన నరపతులను సంహరించటానికే స్వీకరింపబడింది. (కృష్ణుని బాల్యమంతా కంసునీ, తదనుచరులనూ హతమార్చటంలోనూ, యౌవనం శిశుపాల, నరక, జరాసంధాదులను అంతమొందించటంతోనూ గడచిపోయింది). తన కాలంలో

సర్వశ్రేష్ఠుడుగా నిలిచినవాడు శ్రీకృష్ణుడు. కృష్ణుని మనస్సెప్పుడూ లోకులమీదనే ఉంటుంది. తాను జ్ఞానానంద స్వరూపుడు. సాత్త్వికుల సాధనను సఫలం చేస్తుంటాడు. హంసాది తాపసులకు రమణస్థానం కృష్ణుడు. పరమహంసలు నమస్కరింపదగిన పాదాలు గలవాడు కృష్ణుడు. అటువంటి శ్రీకృష్ణుని సాదరంగా సేవిస్తున్నాను.

**విశేషాలు :** 1. వైరాగ్యం తీవ్ర, తీవ్రతర, తీవ్రతమదశలలో ఉంటుంది. తీవ్రదశలో కుటీచకులు, బహూదకులు అని ద్వివిధ సంన్యాసులు. తీవ్రతర దశలో హంసలు, పరమహంసలు అని ద్వివిధసంన్యాసులు. కుటీచకులు, బహూదకులు త్రిదండలు. తీవ్ర, తీవ్రతర దశలలోని వారిది వివిదిషా సంన్యాసం. హంస, పరమహంసల గమనం బ్రహ్మలోకంవైపు. తీవ్రతమదశ విద్వత్ సంన్యాసం. అదే మోక్షం. అదే జీవన్ముక్తి –

శ్లో॥ వక్ష్యే వివిదిషాన్యాసం విద్వన్న్యాసం చ భేదతః ।
హేతూ విదేహముక్తేశ్చ జీవన్ముక్తేశ్చ తౌ క్రమాత్ ॥

శ్లో॥ విరక్తిర్ద్వివిధా ప్రోక్తా తీవ్రా తీవ్రతరేతి చ ।
సత్యామేవ తు తీవ్రాయాం న్యసేద్యోగీ కుటీచకే ॥

శ్లో॥ శక్తో బహూదకే తీవ్రతరాయాం హంససంజ్ఞితే ।
ముముక్షుః పరమే హంసే సాక్షాద్విజ్ఞానసాధనే ॥ – జీవన్ముక్తివివేకః 4,5

**2. అసదవతంస –** చెడ్డతనమే తలమానికంగా గలవారు అనటం చక్కని వ్యక్తీకృతి. శ్రీకృష్ణ నిహతులు దాదాపు అందరూ అటువంటివారే. అందుకే అటువంటి వారినందరినీ తాను స్వయంగా లేదా తన ప్రియానుచరులైన భీమార్జునుల చేతగానీ మరణానికి దగ్గర చేశాడు. చెడ్డతనం కొద్దో గొప్పో చాలామందిలో వుండవచ్చు కానీ అదే తలమానికం కావటం విశేషం.

3. సాత్త్వికులను విజయంవైపు నడిపించటం, వారి ఆశయాలు సిద్ధింపజేయటం, ఆపద్దశలో ఆదుకోవటం కూడా శ్రీకృష్ణుని వ్యక్తిత్వంలో భాగాలు. అందుకే గజేంద్రుడు 'పాహి పాహి' అని నిస్సహాయస్థితిలో ఆక్రోశించగానే పరుగున వచ్చాడు. ఆ రాక ఎటువంటిదో చూడండి –

సిరికింజెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁడభ్రగపతిన్ మన్నింపఁడాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోద్ధతశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై. – పోతనభాగవతము 8/96



**శ్లో॥ రాజీవనేత్ర! విదురాజీవ! మామవతు రాజీవకేతనవశం**
**వాజీభపత్తి నృపరాజీరథాన్వితజరాజీవగర్వశమన! ।**
**వాజీశవాహ! సితవాజీశ! దైత్యతనువాజీశభేదకరదోః!**
**జాజీకదమ్బనవరాజీవముఖ్యసుమరాజీసువాసితశిరః! ॥ 26**

**అవతారిక :** కృష్ణావతారస్తుతియే.

**అన్వయక్రమం :** రాజీవ–నేత్ర! విదుర + ఆజీవ! వాజి + ఇభ–పత్తి–నృప–రాజీ–రథ + అన్విత – జరా జీవ – గర్వ – శమన! వాజి + ఈశ – వాహ! సిత – వాజి + ఈశ! దైత్య – తను – వాజి + ఈశ – భేద – కర – దోః! జాజీ – కదంబ – నవ – రాజీవ – ముఖ్య – సుమ – రాజీ – సువాసిత – శిరః! రాజీవ – కేతన – వశం మామ్ అవతు.

**ప్రతిపదార్థం :** రాజీవ–నేత్ర! = కమలాలవంటి కన్నులు గలవాడా! (చిసప్రసూన రాజీవ పుష్కరామ్భోరుహాణిచ – అమరకోశం); విదుర = విదురునకు / జ్ఞానులకు, ఆజీవ = జీవనం వంటివాడా! ("జ్ఞాతా తు విదురో విన్దుః" – "ఆజీవో జీవికా వార్తా వృత్తి ర్వర్తన జీవనే" – అమరకోశం); వాజీ... శమన : వాజి = గుర్రాలు, ఇభ = ఏనుగులు, పత్తి = కాలి బంటులైన, నృప = రాజులయొక్క, రాజీ = ఒరుసుకొన్న వరుసలయొక్క (రాజీ నిశ్ఛిద్రపంక్తిః – హలాయుధకోశః), రథ = రథాలతో, అన్విత = కూడియున్న, జరా జీవ = జరాసంధునియొక్క, గర్వ = పొగరును, శమన! = అణచివేసినవాడా! (గర్వ = పొగరునకు, శమన! = యమునివంటివాడా!); వాజి = పక్షులకు (నగౌకోవాజి వికిరి వివిష్కిరపతత్రయః – అమరకోశం), ఈశ = ప్రభువైన గరుడు, వాహ! = వాహనంగా కలవాడా!; సితవాజి = తెల్లని గుర్రాలు గల అర్జునునికి, ఈశ! = రక్షకుడా!; దైత్య... దోః : దైత్య = రాక్షసునియొక్క, తను = శరీరంగల, వాజి + ఈశ = అశ్వరాజైన కేశిని, భేద = భేదించే, కర = చేయి, దోః = భుజమూ గలవాడా!; జాజీ... శిరః : జాజీ = జాజిపువ్వు, కదంబ = కడిమిపువ్వు, నవ = క్రొత్తదైన, రాజీవ = తామరపువ్వు, ముఖ్య = ప్రధానమైన, సుమ = పూలయొక్క, రాజీ = ఒత్తైన మాలతో, సువాసిత = పరిమళింప చేయబడిన, శిరః = తలగలవాడా! ఓ కృష్ణా!; రాజీవ... వశమ్ : రాజీవ–కేతన = మదనునకు (మీనకేతనః అని మదనునికి ప్రసిద్ధి అయినా మకరకేతనుడనీ కూడా వాడుతుంటారు. ఇక్కడ మదనుని పంచబాణాలలో ఒకటైన రాజీవాన్ని స్వీకరించి రాజీవకేతనుడని వ్యవహారం); వశమ్ = లొంగియున్న; మామ్ = నన్ను, అవతు = కాపాడుగాక! (అవరక్షణే ధాతువుపై లోట్ ప్రథమపురుషైకవచనం).

**తాత్పర్యం :** కృష్ణా! నీవు రాజీవనేత్రుడవు. విదురాది జ్ఞానులకు జీవనం వంటివాడవు. చతురంగబలాలతో సమన్వితుడైన జరాసంధుని గర్వాన్ని అణచివేసినవాడవు. గరుడవాహనుడవు. శ్వేతవాహనుడైన అర్జునునకు సంరక్షకుడవు. అశ్వరూపాన్ని ధరించిన కేశిదానవుని సంహరించినవాడవు. మాలతి, కడిమి, కమలం మొదలయిన పూల మాలలతో పరిమళింపజేయబడిన శిరస్సు గలవాడవు. మదనునకు లోనైన నన్ను కాపాడు.

**విశేషాలు : విదురభక్తి –** విదురుడు వ్యాసుని కొడుకు. మహాభారతంలో ధృతరాష్ట్రునికి తోడునీడగా నిలిచినవాడు. పాండవుల ప్రతినిధిగా రాయబారానికి వచ్చిన శ్రీకృష్ణుడు విదురుని ఆతిథ్యాన్నే స్వీకరించాడు. భారతసావిత్రి ఈ వృత్తాంతాన్ని స్ఫుటంగా వివరిస్తుంది. తన ఇంటికి వచ్చిన శ్రీకృష్ణునితో విదురుడు పలికిన మాటలు గమనించండి.

శ్లో॥ భవద్దర్శనమాత్రేణ కృతకృత్యోఽస్మ్యహం ప్రభో ।
అద్య మే సఫలం జన్మ అద్య మే సఫలం తపః ॥
అద్య మే పితరస్తుష్టా గోవిందే గృహమాగతే ।

శ్లో॥ అద్యాష్టమీ చ నవమీ చ చతుర్దశీ చ
అద్యాయనం చ విషువం చ దినత్రయం చ ।
అద్యైవ పిండపితృయజ్ఞమఖస్య కాలో
దామోదరేణ సహసా గృహమాగతేన ॥

**2. జరాజీవుడు –** జరాసంధుడుగా ప్రసిద్ధుడైన మగధరాజు. బృహద్రథుని కొడుకు. చండకౌశికముని ఇచ్చిన మామిడిపండును రెండు ముక్కలు చేసి తన భార్యల కిద్దరికీ ఇచ్చాడు బృహద్రథుడు. వాళ్ళు గర్భవతులై చెరొక ముక్కను (శరీరంలో సగం) కన్నారు. అప్పుడు జర అనే రాక్షసి ఆ రెండు ముక్కలను రెండు చేతులలోనికి తీసికొని మోయటానికి వీలుగా కలిపి పట్టుకోగానే రెండూ కలిసి జరాసంధుడు తయారయ్యాడు.

శ్లో॥ అథ కాలే మహాప్రాజ్ఞ యథా సమయమాగతే ।
ప్రజాయేతాముభే రాజన్ శరీరశకలే తదా ॥ 36

.... .... ....

శ్లో॥ తే చతుష్పథ నిక్షిప్తే జరానామథ రాక్షసీ ।
జగ్రాహ మనుజవ్యాఘ్ర మాంసశోణిత భోజనా ॥ 39

శ్లో॥ కర్తుకామా సుఖవహే శకలే సా తు రాక్షసీ ।
సంయోజయామాస తదా విధానబలచోదితా ॥ 40

శ్లో॥ తే సమానీతమాత్రే తు శకలే పురుషర్షభ ।
ఏకమూర్తిధరో వీరః కుమారః సమపద్యత ॥ 41

– శ్రీమహాభారతము – సభా – 17

**3. కేశి :** కేశి కంసప్రేరణతో బృందావనంలోని కృష్ణుణ్ణి సంహరించటానికి వచ్చి, కృష్ణుని చేతిలో ప్రాణాలు కోల్పోయిన రాక్షసుడు. కేశి బృందావనంపై దాడిచేయటాన్ని పోతన వర్ణించిన తీరు...

ఖురపుటాహతిఁదూలి కుంభినీచక్రంబు
ఫణిరాజఫణులకు బరువుసేయ
భీషణహేషావిభీషితులై మింట
నమృతాంధులొండొరు నండఁగొనఁగఁ
జటుల చంచల సటాచ్ఛటల గాడ్పుల మేఘ
ములు విమానములపై ముసుఁగు వడఁగ

వివృతాస్యగహ్వరవిపులదంతంబులు
ప్రళయాగ్ని కీలల పగిది మెఱయఁ
గాలపాశలీలగా వాలమేపార
వాహమగుచు గంధవాహగతుల
విజిత శక్రపాశి వీర్యపయోరాశి
కేశి వచ్చె మంద క్లేశమంద. 10/1164

**4. జాజీ :** సంస్కృతంలో జాతీకుసుమ మంటారు. జాజిపువ్వుగా తెలుగులో ప్రసిద్ధం. కన్నడంలో కూడా అదే పలుకుబడి ఉండవచ్చు. ప్రసిద్ధమైన పుష్పనామం కాబట్టి దానిని సంస్కృతంలోనికి కూడా ప్రయోగం కల్పించాడు కవి.



**శ్లో॥ కాలీహ్రదావసథకాలీయకుణ్డలిపకాలీస్థపాదనఖరా-**
**వ్యాలీనవాంశుకరవాలీగణారుణితకాలీరుచే! జయ జయ ।**
**కేలీలవాపహృతకాలీశదత్తవరనాలీకదృప్తదితిభూ-**
**చూలీకగోపమహిలాఽఽలీతనూఘుసృణధూలీకణాఙ్కహృదయ ॥ 27**

**అవతారిక :** శ్రీకృష్ణావతారస్తుతికే కొనసాగింపు.

అన్వయక్రమం : కాలీ–హ్రద + అవసథ – కాలీయ – కుండలిప – క + ఆలీ – స్థ – పాద – నఖర + అవి + ఆలీ – నవ + అంశు – కరవాలీ – గణ + అరుణిత – కాలీ – రుచే! కేలీ – లవ + అపహృత – కాలీ + ఈశ – దత్త – వర – నాలీక – దృప్త – దితిభూ – చూలీక! గోప – మహిళా + ఆలీ – తనూ – ఘుసృణ – ధూలీ – కణ + అంక – హృదయ! జయ జయ.

**ప్రతిపదార్థం :** కాలీ... రుచే! : కాలీ = యమునలోని (కాళింది యమున 'నామైకదేశే నామగ్రహణ' మన్న న్యాయం మేరకు కాలీ పదానికి యమునార్థం), హ్రద = మడుగు, అవసథ = నివాసస్థానమైన (ధిష్ణ్యమోకో నివసనం స్థానావసథ వాస్తు చ – అమరకోశం), కాలీయ = కాళియుడనే, కుండలి–ప = నాగరాజుయొక్క, క = పడగలపై / తలలపై, స్థ = నిలిచియున్న, పాద = కాళ్ళయొక్క, నఖర = గోళ్ళు అనే, అవి = సూర్యులయొక్క (అవయః శైలమేషార్కాః – అమరకోశం), ఆలీ = పంక్తులయొక్క, నవ = క్రొత్తవైన, అంశు = కిరణాలనే, కరవాలీ = బాకులయొక్క, గణ = సమూహంచే, అరుణిత = ఎఱ్ఱగా చేయబడిన, కాలీ = యమునయొక్క, రుచే = కాంతిగలవాడా!; కేలీ... చూలీక: కేలీ–లవ = స్వల్ప ప్రయత్నంతో, అపహృత = అపహరింపబడిన / లొంగదీసికొనబడిన, కాలీ+ఈశ = మహేశ్వరునిచే, దత్త = ఇవ్వబడిన, వర–నాలీక = వరాలనే తామరలచే, దృప్త = పొగరుబడిన, దితి–భూ = (దితికి పుట్టిన) రాక్షసులనే, చూలీక! = చలిమిడి ముద్దలు గలవాడా! (నిఘంటువులలోని చూలిక పదమే ఇక్కడ 'చూలీక'గా వాడబడింది); గోప... హృదయ : గోప – మహిళా = గోపకాంతలయొక్క, ఆలీ = బృందంయొక్క, తనూ = శరీరాలమీదనున్న, ఘుసృణ = కుంకుమపూవుయొక్క (కుంకుమం ఘుసృణం వర్ణ్యం – వైజయన్తీకోశం), ధూలీ = దుమ్ము నలుసులచే,

అంక = గుర్తింపబడిన, హృదయ = వక్షఃస్థలం గలవాడా!; జయ జయ = వర్ధిల్లు, వర్ధిల్లు. (జి జయే ధాతువుపై లోట్ మధ్యమపురుషైకవచనం).

**తాత్పర్యం :** కాళియుడు నాగరాజు. యమునానదిలోని మడుగులో నివసించేవాడు. (తన విషంతో జలాన్ని కలుషితం చేసి ప్రజలకు దూరం చేసేవాడు). ఆ కాళియుని పడగలపై నిలిచి కాలిగోళ్ళనే సూర్యులయొక్క కాంతులనే కరవాలాలతో యమునను ఎఱ్ఱబరచినవాడా! స్వల్పతపస్సులతోనే సులువుగా రుద్రుని మెప్పించి వరాలను పొందిన రాక్షసులను చలిమిడి ముద్దలుగా అణచినవాడా! గోపకాంతల శరీరాలమీదున్న కుంకుమపువ్వు దుమ్ముకణాలతో గుర్తింపబడిన వక్షఃస్థలం గలవాడా! ఓ కృష్ణా! నీవు. వర్ధిల్లు.

**విశేషాలు :** 1. కాళియుని పడగలపై నృత్యమాడిన శ్రీకృష్ణుణ్ణి పోతన వర్ణించిన తీరు–

ఘనయమునానదీ కల్లోల ఘోషంబు
సరస మృదంగ ఘోషంబు గాఁగ
సాధుబృందావన చరచంచరీక గా
నంబు గాయక సుగానంబు గాఁగఁ
గలహంస సారస కమనీయ మంజుశ
బ్దంబులు తాళశబ్దములు గాఁగ
దివినుండి వీక్షించు దివిజ గంధర్వాది
జనులు సభాసీనజనులు గాఁగఁ

బద్మరాగాది రత్న ప్రభాసమాన
మహితకాళియఫణి ఫణామంటపమున
నళినలోచన విఖ్యాత నర్తకుండు
నిత్యనైపుణ్యమునఁజేర్చి నృత్యమాడె – భాగవతం–10/662



**శ్లో॥ కృష్ణాదిపాణ్డుసుతకృష్ణామనఃప్రచురతృష్ణాసుతృప్తికరవాక్!**
**కృష్ణాంకపాలిరత! కృష్ణాభిధాఘహర! కృష్ణాదిషణ్మహిల! భోః! ।**
**పుష్ణాతు మామజిత! నిష్ణాతవార్ధిముదనుష్ణాంశుమణ్డల! హరే!**
**జిష్ణో! గిరీన్ద్రధర! విష్ణో! వృషావరజ! ధృష్ణో! భవాన్! కరుణయా ॥ 28**

**అవతారిక :** వివిధకోణాలలో శ్రీకృష్ణావతారస్తుతికి కొనసాగింపు.

**అన్వయక్రమం :** కృష్ణ + ఆది – పాండు – సుత – కృష్ణా – మనః–ప్రచుర – తృష్ణా – సుతృప్తికర – వాక్! కృష్ణ+అంక – పాలి – రత! అఘ – హర! కృష్ణ + ఆది – షట్ – మహిళ! నిష్ణాత – వార్ధి – ముద్(త్) – అనుష్ణాంశు – మండల! అజిత! జిష్ణో గిరి + ఇంద్ర – ధర విష్ణో వృష + అవరజ! ధృష్ణో! భోః హరే భవాన్ కరుణయా మామ్ పుష్ణాతు.

**ప్రతిపదార్థం :** కృష్ణ + ఆది = అర్జునుడు మొదలుగాగల, పాండు–సుత = పాండు కుమారులయొక్కయు, కృష్ణా = ద్రౌపదియొక్కయు, మనః = మనస్సులలో, ప్రచుర = విస్తరించిన (ప్రభూతం ప్రచురం ప్రాజ్యం – అమరకోశం), తృష్ణా = ఆశను, సుతృప్తి–కర = సంతృప్తిపరచే, వాక్ = మాటలు గలవాడూ; కృష్ణ + అంక = కృష్ణుని గుర్తులు (భుజాలపై శంఖచక్రాల గుర్తులు) గల వారియొక్క, పాలి = సమూహంపై, రత! = ఆసక్తిగలవాడూ!; అఘ = పాపాలను, హర! = పోగొట్టేవాడా!; కృష్ణ + ఆది = కాళింది మొదలుగాగల, షట్ = ఆరుగురు, మహిళ! = కాంతలు (భార్యలు) గలవాడా (కాళింది, జాంబవతి, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, సులక్షణ ఈ ఆర్గురూ, రుక్మిణీసత్యభామలతో కలిసి ఎనిమిది మంది కృష్ణుని భార్యలు); నిష్ణాత = (కృష్ణతత్త్వమందు) నిష్ణాతులయిన వారియొక్క, వార్ధి–ముత్ = సముద్రమనే ఆనందానికి, అనుష్ణ + అంశు = చల్లని కిరణాలు గల చంద్రునియొక్క, మండల! = మండలం వంటివాడా; అజిత! = ఓటమి లేనివాడా!; జిష్ణో! = జయశీలా!; గిరి + ఇంద్ర–ధర = గోవర్ధనాన్ని ధరించినవాడా!; విష్ణో = వ్యాపనశీలా!; వృష + అవరజ! = ఇంద్రునియొక్క తమ్ముడా (ఉపేంద్రుడా!); ధృష్ణో = దిట్టతనం గలవాడా!; భోః! = ఓయీ; హరే = శ్రీకృష్ణా; భవాన్ = నీవు; కరుణయా = దయతో; మామ్ = నన్ను; పుష్ణాతు = పుష్టిగలవానినిగా చేయి. (పుష్ పుష్టౌ ధాతువుపై లోట్ ప్రథమపురుషైకవచనం).

**తాత్పర్యం :** అర్జునుడు మొదలయిన పాండవులకు, ద్రౌపదికి మనస్సులలో ప్రభూతమైన ఆశను సంతృప్తిపరుస్తూ మాటాడిన వాడవు నీవు. కృష్ణా! తప్తశంఖచక్రాదులను ధరించిన వారిపై అనురక్తుడవు నీవు. పాపపరిహారకుడవు. కాళింది మొదలుగాగల ఆర్గురు భార్యలు గలవాడవు. జయశీలుడవు. వ్యాపనశీలుడవు. నీ భక్తితత్త్వంలో నిష్ణాతులయినవారి ఆనందసముద్రాన్ని ఉప్పొంగజేసే చంద్రమండలం నీవే! నీవు గోవర్ధనగిరిధారివి. ఉపేంద్రుడవు. దిట్టవు. కృష్ణా! కరుణతో నన్ను సత్త్వసంపన్నుని చేయి.

**విశేషాలు :** 1. ఆశలను ఫలింపజేసుకొనే సమయంలోనూ, ఆపత్కాలంలోనూ గూడా పాండవులనూ, ద్రౌపదిని తృప్తిపరుస్తూ మాటాడినవాడు, ఆయా కార్యాలకు అనుగుణంగా వారిని అనునయించి, కార్యసిద్ధికి దోహదం చేసినవాడు కృష్ణుడే. ద్రౌపదితో సహా పాండవుల ఆశయాలకూ, ఆశలకూ అనుగుణంగా వారితో మాటాడి అంతర్గతంగా వున్న రాజ్యతృష్ణను కృష్ణుడు సంతృప్తిపరచటం మహాభారతంలోని ఉద్యోగపర్వంలో తాను రాయబారిగా వెళ్ళటానికి ముందు కృష్ణుడు వారితో మాటాడిన తీరులో గమనించవచ్చు. మచ్చుకు కృష్ణుడు ద్రౌపదితో...

ప్రుచ్చిరనేల నేఁగలుగ ముద్దియ! నాకు వృకోదరుండు వి
వ్వచ్చుడుఁదోడుగాఁగ జనవంద్యుడు ధర్మసుతుండు పంపనీ
మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెదఁగాక – వేఱొకం
డచ్చు పడంగ నేర్చునె? దురాత్ములు కౌరవులుర్వి యిత్తురే!

**2. కృష్ణాంక :** వైష్ణవంలో శంఖ, చక్ర, పద్మ, గదా, నారాయణ ముద్రల పేరుతో అయిదు ముద్రలను ధరించటం ప్రధానమైన అంశం. **తప్తధారణమని** దీన్ని వ్యవహరిస్తారు. శీతలధారణమన్న ప్రక్రియ కూడా ఉంటుంది. బలహీనులు చక్రధారణకు, మరికొంత శక్తిగలవారు శంఖచక్రధారణకు పరిమితమైన సత్త్వసంపన్ను లందరూ పంచముద్రలను స్వీకరిస్తారు. కుడిభుజంమీద

చక్రం, ఎడమభుజంమీద శంఖం ముద్రింపబడతాయి. మిగిలినవి కూడా ధరించేటట్లయితే వక్షఃస్థలం, ఉదరం, నుదుటి పైభాగంమీద ఈ ముద్రలను స్వీకరిస్తారు. వీటివిషయంలో కుల, లింగ భేదాలేమీ ఉండవు. వయోనియమముండదు. తొలిఏకాదశినాడు ఈ తప్తధారణ కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. సంన్యసించినవారే ఈ దీక్ష నివ్వటానికి అర్హులు. శ్రీ వాదిరాజ తీర్థరు చక్రస్తుతిలోనూ, యుక్తిమల్లికలోనూ ఈ చక్రధారణను సమర్థిస్తారు.

చక్రస్తుతి –

శ్లో॥ దోషౌఘవారణం యస్య ధారణం మోక్షకారణమ్ ।
న వైదికం తప్తచక్రధారణం యది మన్యసే ॥

శ్లో॥ గ్రంథాదౌ మంగలం తర్హి కస్మాన్నావైదికం తవ ।
శిష్టాచారాత్ స్మృతిః కల్ప్యా స్మృతేశ్చ శ్రుతికల్పనా ॥ – చక్రస్తుతిః–1,2

శంఖచక్రధారణ ప్రాధాన్యాన్ని పాంచరాత్రాగమ మిలా వివరిస్తుంది.

శ్లో॥ అగ్నీషోమౌ హి చక్రాబ్జౌ సర్వ ఏవ తదాత్మకాః ।
యది వా మానయేన్నేకం పూర్ణో హి పరమశ్నుతే ॥

శ్లో॥ శంఖచక్రప్రధానం హి సర్వమన్యద్ గదాదికమ్ ।
అంకితః శంఖచక్రాభ్యాం సర్వైరంకిత ఏవ వా ॥ – భారద్వాజసంహిత – 65,66



**శ్లో॥ రామాశిరోమణిధరామాసమేత! బలరామానుజాభిధ! రతిం**
**వ్యోమాసురాన్తకర తే మారతాత! దిశ మే మాధవాంఘ్రికమలే ।**
**కామార్తభౌమపురరామావలీప్రణయవామాక్షిపీతతనుభా(ః!)**
**భీమాహినాథముఖవైమానికాభినుత! భీమాభివంద్యచరణ ॥ 29**

**అవతారిక :** శ్రీకృష్ణావతారస్తుతికే కొనసాగింపు.

**అన్వయక్రమం :** రామా – శిరోమణి – ధరా – మా – సమేత! బలరామ + అనుజ + అభిధ! వ్యోమ + అసుర + అన్త – కర! కామ + ఆర్త – భౌమ – పుర – రామా + ఆవలీ – ప్రణయ – వామా + అక్షి – పీత – తను – భాః! భీమ + అహినాథ – ముఖ – వైమానిక + అభినుత! భీమ + అభివంద్య – చరణ! మారతాత! మాధవ తే అంఘ్రి – కమలే మే రతిం దిశ.

**ప్రతిపదార్థం :** రామా... సమేత : రామా = స్త్రీలకు, శిరోమణి = తలమానికమైన, ధరా = భూదేవితోనూ (భూర్భూమిరచలానన్తా ధరా విశ్వమ్భరా స్థిరా – అమరకోశం), మా = లక్ష్మితోనూ, సమేత = కూడియున్నవాడా!; బలరామ = బలరామునియొక్క, అనుజ = తమ్ముడనే, అభిధ = పేరుగలవాడా! (తమ్ముడుగా ఉండటం తమ్ముడనిపించుకోవటం వేరు వేరు విషయాలు. కృష్ణుడెప్పుడూ బలరాముని కించపరచలేదు); వ్యోమ + అసుర = వ్యోముడనే రాక్షసునకు, అన్త–కర! = ముగింపును

కలిగించినవాడా!; కామార్త... భా : కామ = మదనునిచే, ఆర్త = పీడింపబడిన, భౌమ = నరకాసురునియొక్క, పుర = నగరమందలి (ప్రాగ్జ్యోతిషపురమందలి), రామా = స్త్రీలయొక్క, ఆవలీ = సమూహంయొక్క, వామ = అందమైన (వామౌ వల్గుప్రదీపౌ ద్వౌ – అమరకోశం), అక్షి = కళ్ళచే, పీత = త్రాగబడిన, తను–భాః! = దేహకాంతి గలవాడా!; భీమా... మతః : భీమ = రుద్రుడు, అహి–నాథ = ఆదిశేషువు, ముఖ = మొదలుగా గల, వైమానిక = దేవతలచే, అభినుత! = ప్రశంసింపబడినవాడా!; భీమ = భీమసేనునిచే (వాయుసుతునిచే), అభివంద్య = నమస్కరింపబడిన, చరణ = కాళ్ళు గలవాడా!; మార–తాత = మదనునకు జనకుడా!; మాధవ = కృష్ణా; తే = నీయొక్క; అంఘ్రి– కమలే = పాదపద్మమందు; మే = నాకు; రతిమ్ = ఆసక్తిని; దిశ = ఇమ్ము.

**తాత్పర్యం :** కాంతాశిరోమణులైన భూదేవి, శ్రీదేవి నీకు భార్యలు. బలరాముని తమ్మునిగా నీకు పేరు. వ్యోమాసురుని అంతంచేసినవాడవు నీవు. కామవశుడై కాంతలను చెరబట్టిన నరకుని నగరంలోని వామాక్షులచేత (నరక మరణానంతరం) త్రాగబడిన తనుసౌందర్యం గలవాడవీవు. రుద్రుడు, ఆదిశేషువు మొదలగు దేవతలచే నుతింపబడేవాడవు నీవు. భీమసేనునిచే నమస్కరింపబడిన కాళ్ళు గలవాడవు. మదనజనక! నీ పాదకమలాలపై నాకు ఆసక్తిని / భక్తిని కలిగించు.

**విశేషాలు : 1. వ్యోమాసురాన్తకర –** వోమాసురుడు గోపాలవేషంతో గోపాలకులను మెల్లమెల్లగా గొనిపోయి కొండగుహలో దాచినవాడు. గుహద్వారాన్ని కప్పి ఏమీ తెలియనట్లు చరిస్తున్నవాడు. కృష్ణుడు ఆ విషయాన్ని గ్రహించి వ్యోమాసురుని చంపి గోపబాలకులను విడిపించాడు.

పంకజలోచనుండొడిసి పట్టిన శైలనిభాసురాకృతిన్
బింకముతోడఁ బొంగి విడిపించుకొనంగ బలంబులేమిలో
శంకిలి బిట్టు తన్నుకొనఁ జక్కన నారణభీము వ్యోమునిన్
గొంకకఁగూల్చె నవ్విభుడు కోయని మింట సుపర్వులోర్వఁగన్.

ఘోరధనుజునేలఁగూల్చి పర్వతగుహ
వాతనున్న ఱాయిద్రవ్వ్యఁదన్ని
గుహ చరించుచున్న గోపాలకులఁగొంచు
బల్లిదుండు గొల్లపల్లె కరిగె. – పోతన భాగవతము 10/1184,85

2. నరకుని నుండి రక్షింపబడిన రాజకుమారికలు కృష్ణుని వరించుట –

పాపపు రక్కసుండు చెఱపట్టెనటంచుఁదలంతుమెప్పుడున్
బాపుఁడె! వీని ధర్మమునఁబద్మదళాక్షునిఁ గంటిమమ్మ! ము
న్నీ పురుషోత్తముంగదియ నేమి వ్రతంబులు చేసినారమో
యా పరమేష్ఠి పుణ్యుఁడు గదమ్మ హరిన్ మముఁ గూర్చె నిచ్చటన్. ...

భూనాథోత్తమ కన్యకల్ వరుస నంభోజాతనేత్రుండు న
న్నే నవ్వెన్ దగఁజూచె దగ్గఱియె వర్ణించెన్ వివేకించె స

న్మానించెన్ గరుణించెఁబేరడిగె సన్మార్గంబుతోఁ బెండ్లియౌ
నేనే చక్రికి దేవినంచుఁ దమలో నిర్ణీతలైరందఱున్ ।

– పోతన భాగవతము 10/2/2019, 213

నరకుడు చెరపట్టడాన్ని గూడా ఇప్పుడు కృష్ణసందర్శన కారణంగా పుణ్యఫలంగానే భావిస్తున్నారు ఆ రాజకుమారులు. శాపాలు వరాలుగా పరిణమించట మంటే ఇదే. ఆ కాంతలు ఎవరి మట్టుకు వారు శ్రీకృష్ణుడు తన్నే మన్నిస్తున్నాడని భావిస్తున్నారు.

**3. అంఘ్రికమలే రతిం –**

**నీ పాదకమలసేవయు**
**నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం**
**తాపారభూతదయయును**
**తాపసమందార! నాకు దయసేయగదే!** – పోతనభాగవతం 10/1/1268

ఇది అక్రూరుని ప్రార్థన.



**శ్లో॥ సక్ష్వేలభక్ష్యభయదాక్షిశ్రవోగణజలాక్షేపపాశయమనం**
**లాక్షాగృహజ్వలనరక్షోహిడిమ్బబకభైక్షాన్నపూర్వవిపదః ।**
**అక్షానుబన్ధభవరూక్షాక్షరశ్రవణసాక్షాన్మహిష్యవమతీ**
**కక్షానుయానమధమక్ష్మాపసేవనమభీక్ష్ణాపహాసమసతామ్ ॥ 30**

**శ్లో॥ చక్షాణ ఏవ నిజపక్షాగ్రభూదశశతాక్షాత్మజాదిసుహృదా–**
**మాక్షేపకారికునృపాక్షౌహిణీశతబలాఽఽక్షోభదీక్షితమనాః ।**
**తార్క్ష్యాసిచాపశరతీక్ష్ణారిపూర్వనిజలక్ష్మాణి చాప్యగణయన్**
**వృక్షాలయధ్వజరిరక్షాకరో జయతి లక్ష్మీపతిర్యదుపతిః ॥ 31**

**అవతారిక :** 30, 31 శ్లోకాలకు కలిపి అన్వయం. దీన్ని యుగ్మకమంటారు. శ్రీకృష్ణుడు పాండవులను వివిధ సందర్భాలలో రక్షించిన వైనాన్ని స్పృశిస్తూ ప్రస్తుతి.

**అన్వయక్రమం :** స క్ష్వేల – భక్ష్య – భయద + అక్షిశ్రవః + గణ – జల + ఆక్షేప – పాశ – యమనమ్ లాక్షా – గృహ – జ్వలన – రక్షః + హిడింబ – బక – భైక్ష + అన్న – పూర్వ – విపదః అక్ష + అనుబంధ – భవ – రూక్ష + అక్షర – శ్రవణ – సాక్షాత్ – మహిషీ + అవమతీ కక్ష + అనుయానమ్ అధమ + క్ష్మాప – సేవనమ్ అసతామ్ అభీక్ష్ణ + అపహాసతామ్.

చక్షాణః + ఏవ నిజ – పక్ష + అగ్ర – భూ – దశ శత + అక్ష + ఆత్మజ + ఆది – సుహృదామ్ ఆక్షేప–కారి – కునృప + అక్షౌహిణీ – శత – బల + ఆక్షోభ – దీక్షిత – మనాః తార్క్ష్య + అసి + చాప – శర – తీక్ష్ణ + అరి – పూర్వ – నిజ – లక్ష్మాణి చ అగణయన్ అపి వృక్ష + ఆలయ – ధ్వజ – రిరక్షా – కరః యదు – పతిః లక్ష్మీపతిః జయతి.

ప్రతిపదార్థం : సక్ష్వేల... యమనమ్ : సక్ష్వేల = విషంతో కూడిన (గరళం తు విషం క్ష్వేలః – వైజయన్తీకోశః), భక్ష్య = ఆహారమూ, భయ–ద = భయంకరమైన, అక్షి–శ్రవః = పాములయొక్క గణ = సమూహమూ, జల = నీటిలో, ఆక్షేప = పూర్తిగా ముంచుట, పాశ = త్రాళ్ళతో, యమనమ్ = బంధించుట; లాక్షా... విపదః : లాక్షా–గృహ = లక్క ఇంటిని, జ్వలన = తగులబెట్టుట, రక్షః = రాక్షసులైన (నైరృతో యాతు రక్షసీ – అమరకోశం), హిడింబ = హిడింబుడు, బక = బకుడు (వారితో పోరు), భైక్ష + అన్న = బిచ్చమెత్తి ఆహారాన్ని సంపాదించుకొనటం, పూర్వ = మొదలైన, విపదః = కష్టాలు; అక్షా... మతీః : అక్ష = పాచికల ఆటకు, అనుబంధ = కొనసాగింపుగా, భవ = పుట్టిన, రూక్ష = కర్కశమైన, అక్షర = మాటలను, శ్రవణ = వినుటయు, సాక్షాత్ = అందరి కళ్ళముందే, మహిషీ = రాణియైన ద్రౌపదియొక్క, అవమతీ = అవమానమును (శ్రవణం చ... అవమతిశ్చ అని ద్వివచనంలో అవమతీ అని ప్రయోగం); కక్ష = అడవినిగూర్చి (కక్షౌ చ తృణ వీరుధౌ – అమరకోశం. చకారం వలన అడవి అనికూడా అర్థం అని గురుబాలప్రబోధిక), అనుయానమ్ = వెళ్ళుట; అధ... వనమ్ : అధమ = హీనులైన / తమకన్న తక్కువస్థాయికి చెందిన, క్ష్మాప = రాజులను, సేవనమ్ = సేవించుట / ఆశ్రయించుట (పాండవులు అజ్ఞాతవాసంలో విరాటుని ఆశ్రయించటం); అసతామ్ = చెడ్డవారియొక్క, అభీక్ష్ణ = నిరంతరమైన, అపహాసతామ్ = హేళననూ,

చక్షాణః ఏవ = చూస్తూనే (చక్ష్ ధాతువుపై శానచ్ ప్రత్యయం. చక్ష్ ధాతువు కథనార్థకం. అయితే దర్శనార్థంలో ఋగ్వేదప్రయోగం– "స్తృణీత బర్హిరానుషగ్ ఘృతపృష్ఠం మనీషిణః। యత్రామృతస్య దర్శనమ్" 1–13–5); నిజ–పక్ష = తనవాడైన భీమసేనుడు, అగ్ర–భూ = (అతనికన్నా) ముందు పుట్టిన ధర్మరాజు, దశశత + అక్ష = వేయి కన్నులుగల ఇంద్రునియొక్క, ఆత్మ జ = కుమారుడైన అర్జునుడు, ఆది = మొదలుగాగల, సుహృదామ్ = మిత్రులకు / ఆత్మీయులకు; ఆక్షేప... మనాః : ఆక్షేప–కారి = చెదురుబాటును కల్గించే శత్రువులైన, కు నృప = చెడ్డరాజులయొక్క, అక్షౌహిణీ–శత = వందల అక్షౌహిణులు గల, బల = సేనను, ఆక్షోభ = కలతపెట్టుటయందు, దీక్షిత = పట్టుదల గల, మనాః = మనస్సు గలవాడై; తార్క్ష్య... లక్ష్మాణి : తార్క్ష్య = గరుడుడు, అసి = కత్తి, చాప = విల్లు, శర = బాణాలు, తీక్ష్ణ+అరి = చక్రమూ, పూర్వ = మొదలుగాగల, నిజ = తనయొక్క, లక్ష్మాణి = లక్షణాలను / చిహ్నాలను, చ అపి = కూడా; అగణయన్ అపి = లేకచేయక (చ, అపి విడివిడిగా కూడా సముచ్చయార్థకాలే. రెండింటినీ కలిపి కూడా వాడటం కవుల వాడుక. "గుణాద్రూపగుణాచ్చాపి ప్రీతిర్భూయోఽభ్యవర్ధత" – వాల్మీకి ప్రయోగం); వృక్ష... కరః : వృక్ష + ఆలయ = ఆంజనేయుడు (కపి), ధ్వజ = ధ్వజచిహ్నంగా గల అర్జునునికి, రిరక్షా – కరః = రక్షణేచ్ఛను కలిగించువాడై, యదుపతిః = యదువంశప్రభువైన, లక్ష్మీపతిః = శ్రీకృష్ణుడు, జయతి = వర్ధిలుతున్నాడు. (జి జయే ధాతువుపై లిట్ ప్రథమపురుషైకవచనం).

**తాత్పర్యం :** ఆహారంలో విషం గలపటం, భయంకరసర్పాలతో కరిపించటం, నీటిలో ముంచటం, త్రాళ్ళతో బంధించటం (ఇవన్నీ దుర్యోధనాదులు భీముని విషయంలో చేసిన పనులు), లక్కయింటిని తగులబెట్టడం, బకాసుర, హిడింబాసురుల నుండి తప్పించుకోవటం (వీటిలో బకాసురవిషయం పరోపకారదృష్టితో కుంతి తనంత తానుగా ఆహ్వానించిన అంశం) మొదలయిన ఆపదలనుగూర్చి,

జూదమాడటం దానిలో భాగంగా కౌరవపాండవులు పరస్పరం పరుషంగా మాటాడుకోవటం, ద్రౌపది పరాభవింపబడటం, అరణ్యసంచారం చేయటం, అజ్ఞాతవాసంలో పాండవులు అధమనరపాలుని సేవింపవలసి రావటం, పదే పదే శత్రువుల హేళనకు గురికావటం – ఇవన్నీ విని, తనవాడైన భీమసేనునీ, అతని అన్నదమ్ములను ఆక్షేపించే దుష్టరాజులను పూర్తిగా కలచివేయాలన్న దీక్షతో తన వాహనాన్నీ, వివిధాయుధాలనూ కూడా విడిచి అర్జునుని రక్షింపగోరిన యదుపతియైన లక్ష్మీపతి వర్ధిల్లుతున్నాడు.

**విశేషాలు :** 1. ఈ రెండు శ్లోకాల స్తుతిలో మహాభారతంలోని ప్రధానకథాభాగస్పర్శ వుంది. పాండురాజు అరణ్యంలో మరణించిన తరువాత కుంతి పాండవులతో కలిసి హస్తినకు వచ్చింది. వారు అలా రావటం తరువాత జరగబోయే కౌరవపాండవ సంగ్రామాలకూ, కౌరవవంశవినాశనానికి మూలమైంది. అయితే వారు కారణం కాదు ప్రత్యేకించి అదొక మలుపు. అప్పుడు వ్యాసమహర్షి తల్లికి చేసిన సూచన రాజ్యాన్ని విడిచి వానప్రస్థానికి బయలుదేరమని. ఆ సందేశారంభం గమనించండి.

శ్లో॥ అతిక్రాంతసుఖాః కాలాః పర్యుపస్థితదారుణాః ।
శ్వః శ్వః పాపిష్ఠదివసాః పృథివీ గతయౌవనా ॥ – ఆది – 127/6

2. బాల్యక్రీడలతో ఆనందంగా గడుపుతున్న కౌరవపాండవుల మధ్య పరస్పర ద్వేషమేర్పడటానికి కారణం భీమసేనుని అత్యుత్సాహం, వయస్సుకు మించిన బలదర్పాలు. విద్వేషబీజాన్ని వ్యాసముని ఎలా ప్రక్షేపించాడో చూడండి –

శ్లో॥ హర్షాత్ క్రీడమానాంస్తాన్ గృహ్య రాజన్ నిలీయతే ।
శిరస్సు వినిగృహ్యైతాన్ యోధయామాస పాండవైః ॥

శ్లో॥ శతమేకోత్తరం తేషాం కుమారాణాం మహౌజసామ్ ।
ఏక ఏవ నిగృహ్ణాతి నాతికృచ్ఛ్రాద్వృకోదరః ॥

శ్లో॥ కచేషు వినిగృహ్యైనాన్ వినిహృత బలాద్ బలీ ।
చకర్ష క్రోశతో భూమౌ ఘృష్టజాశుశిరోసంకాన్ ॥ – ఆది–127/17–19

"ధార్తరాష్ట్రులు ఆనందంగా ఆడుకొంటుంటే వారిని పట్టుకొని ఎక్కడో దాగి ఉండేవాడు. వారిని పట్టుకొని పాండవులతో పోరించేవాడు.... వారు ఆక్రోశిస్తున్నా లెక్కచేయకుండా నేలమీద పడవేసి ఈడ్చేవాడు. అపుడు వారి మోకాళ్ళూ, తలలూ, భుజాలు డోక్కొని పోయేవి..."

దీని పర్యవసానంగా దుర్యోధనాదులు "సక్ష్యేల భక్ష్య"... మొదలగు ప్రతీకార చర్యలకు పాల్పడ్డారు. అక్కడనుండి వారణావతానికి పంపి లక్కయింటిలో నివసింప జేశారు. అయితే లక్కయింటిని దహించింది మాత్రం ధర్మజుని ఆదేశం మేరకు భీమసేనుడే. పారిపోవడానికి పాండవులు పన్నిన వ్యూహంలో అదొక భాగం. ఆ సమయంలో వారు ఒక నిషాది, ఆమె అయిదుగురు కుమారుల మరణానికి కారణమయ్యారు. అది అధర్మమవుతుందేమో అని ధర్మరాజుకు కూడా ఆలోచన రాలేదు.

అలా పారిపోతూ అరణ్యంలో హిడింబాసురుని ఎదిరించటం, ఏకచక్రపురంలో

బిచ్చమెత్తుకొని బ్రాహ్మణవేషంలో బ్రతుకుతూ బకాసురుని వధించటం (భీముడు), ద్రౌపదితో పరిణయం ఒక భాగమైతే, జూదమాడి ద్రౌపదీపరాభవానికి కారణం కావటం ఘోరప్రతిజ్ఞలు చేయటం లోకవిదితం. వాటి పరిణామం సర్వనాశనం.

ఇదంతా చూస్తూ కూడా శ్రీకృష్ణుడు **'వృక్షాలయధ్వజరిరంసా'** పరుదు కావటం విశేషం.



**శ్లో॥ బుద్ధావతార కవిబద్ధానుకమ్ప! కురు బద్ధాంజలౌ మయి దయాం**
**శౌద్ధోధనిప్రముఖసైద్ధాన్తికాసుగమబౌద్ధాగమప్రణయన! ।**
**క్రుద్ధాహితాసుహృతిసిద్ధాసిఖేటధర శుద్ధాశ్వయాన! కమలా-**
**శుద్ధాన్త! మాం రుచిపినద్ధాఖిలాఙ్గ! నిజమద్ధావ కల్క్యభిధ భోః ॥ 32**

**అవతారిక :** బుద్ధ కల్క్యవతారాల స్తోత్రం ఒకే శ్లోకంలో...

**అన్వయక్రమం :** శౌద్ధోధని - ప్రముఖ - సైద్ధాన్తిక - అసుగమ - బౌద్ధ + ఆగమ - ప్రణయన కవి - బద్ధ + అనుకంప! బుద్ధ + అవతార! బద్ధ + అంజలౌ మయి దయాం కురు.

క్రుద్ధ + అహిత + అసు - హృతి - సిద్ధ + అసి - ఖేట - ధర! శుద్ధ + అశ్వ యాన! కమలా - శుద్ధాంత! రుచి - పినద్ధ + అఖిల + అంగ! భోః! కల్కి + అభిధ! నిజం మామ్ అద్ధా అవ.

**ప్రతిపదార్థం :** శౌద్ధో... ప్రణయన! : శౌద్ధోధని-ప్రముఖ = శుద్ధోదనకుమారుడు (గౌతముడు) మొదలుగాగల, సైద్ధాన్తిక = సిద్ధాన్తవేత్తలచే, అసుగమ = సులువుగా తెలియరాని, బౌద్ధ + ఆగమ = బుద్ధసిద్ధాంతాలకు సంబంధించిన ఆగమాలను (ఆచరణను బోధించే శాస్త్రీయరచనలను), ప్రణయన! = రచించినవాడా!; కవి... కంప : కవి = పండితులైన, బద్ధ = లగ్నం చేయబడిన, అనుకంప! = దయగలవాడా!; బద్ధ + అంజలౌ = చేతులు జోడించిన; మయి = నాపై; దయాం కురు = దయ చేయుము.

క్రుద్ధా... ధర : క్రుద్ధ = కోపించిన, అహిత = శత్రువులయొక్క, అసు = ప్రాణాలను, హృతి = హరించుటయందు, సిద్ధ = ప్రసిద్ధి వహించిన, అసి = కత్తిని, ఖేట = డాలును, ధర! = ధరించినవాడా!; శుద్ధ = తెల్లని, అశ్వ = గుఱ్ఱం, యాన! = వాహనమైనవాడా!; కమలా = లక్ష్మి, శుద్ధాంత! = అంతఃపురంగా గలవాడా!; రుచి... లాంగ : రుచి = కాంతిచే, పినద్ధ = కప్పబడిన, అఖిల = సమస్తమైన, అంగ! = అవయవాలు గలవాడా!; భోః = ఓయీ; కల్కి + అభిధ! = కల్కి యను పేరుగలవాడా!; నిజమ్ = నీవాడనైన; మామ్ = నన్ను; అద్ధా = బాగుగా; అవ = రక్షించు.

**తాత్పర్యం :** శుద్ధోదనకుమారుడు (బుద్ధుడు) మొదలుగాగల సైద్ధాంతికులకు కూడా సులువుగా అవగాహన కాని బౌద్ధాగమాలను రచించినవాడా! పండితులపై దయగలవాడా! బుద్ధావతారా! నారాయణా! చేతులు జోడిస్తున్నాను, నాపై దయజూపు.

క్రుద్ధులైన శత్రువుల ప్రాణాలను తీయటంలో ప్రసిద్ధమైన కత్తి, డాలూ గలవాడా! తెల్లనిగుఱ్ఱం

నీ వాహనం. కమల నీ అంతఃపురం. నీ శరీరావయవాలు కాంతిచే కప్పబడినవి. కల్కి అనుపేర వెలసిన దైవమా, నేను నీవాడను నన్ను రక్షించు.

**విశేషాలు :** ఇక్కడ కవి మాయాదేవి శుద్ధోధనుల కుమారుడైన గౌతమబుద్ధుని కన్న విష్ణుమూర్త్యవతారమైన బుద్ధుని వేరుగా స్వీకరించి ప్రస్తుతిస్తున్నాడు. గౌతమబుద్ధుడు చారిత్రకపురుషుడు. ప్రస్తుతస్తుతివిషయమైన బుద్ధుడు విష్ణుదశావతారాలలో నొకడు. అందుకే **"శౌద్ధోధనిప్రముఖసైద్ధాన్తికాసుగమ"** – అని గౌతమబుద్ధుని వంటి సైద్ధాన్తికులకు కూడా అంత తేలికగా అర్థంకానివి బౌద్ధాగమాలని ప్రకటించటం.



**శ్లో॥ సారఙ్గకృత్తిధరసారఙ్గవారిధర! సారఙ్గరాజవరదా–**
**సారం గదారితరసాఽఽరఙ్గతాత్మమదసారం గతౌషధబలమ్ ।**
**సారఙ్గవత్కుసుమసారం గతం చ తవ సారంగమాంఘ్రియుగలం**
**సారఙ్గవర్ణమపసారం గతాబ్జమదసారం గదింస్త్వమవ మామ్ ॥** 33

**అవతారిక :** అవతారనిరపేక్షంగా విష్ణుస్తుతి

**అన్వయక్రమం :** సారంగ – కృత్తి – ధర – సారంగ – వారి – ధర! సారంగ – రాజ – వరద! గదిన్! త్వం గద + అరి – తరసా అసారమ్ ఆరంగత + ఆత్మ – మద – సారం గత + ఓషధ – బలం సారంగవత్ – కుసుమ – సారం సారంగ – వర్ణమ్ అపసారంగత + అబ్జ – మద – సారం తవ సారంగమ + అంఘ్రి – యుగలం గతం మామ్ చ అవ.

**ప్రతిపదార్థం :** సారంగ... ధర : సారంగ = జింకయొక్క, కృత్తి = చర్మాన్ని, ధర = ధరించెడి మునులు అనే, సారంగ = చాతక పక్షులకు (దార్వాఘాటోఽథ సారంగస్తోక కశ్చాతకస్సమాః – అమరకోశం), వారిధర! = మేఘంవంటి వాడా!; సారంగ – రాజ = గజరాజునకు (సారంగం పుంసి హరిణే చాతకే చ మతంగజే – మేదినీకోశం) వర–ద! = వరాల నిచ్చినవాడా! (భాగవతపురాణంలోని గజేంద్రమోక్షకథ లోకప్రసిద్ధం); గదిన్! = గదాధరా!, త్వమ్ = నీవు; గదా... తరసా : గద = (భవ) రోగ మనే, అరి = శత్రువుయొక్క, తరసా = వేగంచేత; అసారమ్ = శక్తి కోల్పోయినవాడనూ; ఆరం... సారమ్ : ఆరంగత = తూట్లుపడిన, ఆత్మ = తన (నా)యొక్క, మద = పొగరుయొక్క, సారమ్ = శక్తి గలవాడనూ; గతౌ... బలమ్ : గత = నశించిన, ఓషధ = మందులయొక్క, బలమ్ = బలం గలవాడనూ (మందులు పనిచేసే శక్తికూడా లేకపోవటం); సారంగ... సారమ్ : సారంగవత్ = తుమ్మెదలతో కూడిన, కుసుమ – సారమ్ = పూదేనె గలదీ, సారంగ – వర్ణమ్ = చిత్రవర్ణాలు కలిగి; అప... సారమ్ : అపసారంగత = తిరస్కరింపబడిన, అబ్జ = తామరయొక్క, మద = అహంకారంయొక్క, సారమ్ = సారం కలిగినట్టి; తవ = నీయొక్క, సారం... యుగలమ్ : సారంగమ = సారంవైపు (వైకుంఠంపైపు) కదిలెడి, అంఘ్రియుగలమ్ = పాదయుగ్మాన్ని; గతమ్ = ఆశ్రయించిన, మామ్ చ = నన్ను కూడా; అవ = రక్షించు.

**తాత్పర్యం :** నారాయణా! గదాధారీ! జింకచర్మాలు ధరించిన మునులు అనే చాతకపక్షులకు నీవు మేఘంవంటివాడవు. (వారి భావదాహాన్ని తీర్చేవాడవు). సంసారరూపమైన శత్రువుయొక్క వేగంతో

నేను శక్తిహీనుడనవుతున్నాను. నా అహంకారం, పొగరు అణగిపోతున్నాయి. ఓషధశక్తి కూడా నాకు ఉపయోగపడటం లేదు. నేను నీ పాదపద్మయుగళిని ఆశ్రయిస్తున్నాను. అది తుమ్మెదలతో కూడిన సుమసారం గలది. చిత్రవర్ణమహితమైనది. తామరసమదాన్ని అణచివేయగలది. అలా ఆశ్రయించిన నన్ను నీవు రక్షించు.

**విశేషాలు :** 1. భవరోగంనుండి బయటపడాలంటే నారాయణ భజనం తప్ప మరొకటి లేదు. ఇది భాగవతతత్త్వం. పోతన ప్రహ్లాదుని నోట పలికించిన అంశమిదే.

సంసారజీమూతసంఘంబు విచ్చునే
 చక్రిదాస్యప్రభంజనములేక;
తాపత్రయాభీలదావాగ్నులారునే
 విష్ణుసేవామృతవృష్టిలేక;
సర్వంకషాఘౌఘజలరాసులింకునే
 హరిమనీషాబడబాగ్నిలేక;
ఘనవిపద్గాఢాంధకారంబు లడగునే
 పద్మాక్షునుతిరవిప్రభలులేక;

నిరుపమాపునరావృత్తి నిష్కళంక
ముక్తినిధిఁగానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనములేక
తామరాసగర్భునకు నైన దానవేంద్ర! – పోతనభాగవతము 7/171

**2. సారంగ / శారంగ :** సారంగ పదార్థాలలోనే తాలవ్యాది అయిన శారంగ పదం కూడా నిఘంటువులలో ఉన్నది. "శారంగశ్చాతకే ఖ్యాతః శబలే హరిణేపి చ" ఇతి తాలావ్యాదావజయః" అని అమరకోశ టీకలో సూచింపబడింది.

3. కవి ఈ శ్లోకంలో శరణాగతి లక్షణాన్ని ప్రకటిస్తున్నాడు.

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం నమామ్యహమ్ ॥

అని గీతావచనం. ఆత్మమదసారమూ, ఓషధి కూడా నిరుపయోగమైన దశలో ఇక మిగిలినది అనన్యచిన్తనతో కూడిన పర్యుపాసనమే.



**శ్లో॥ గ్రీవాస్యవాహతనుదేవాణ్డజాదిదశభావాభిరామచరితం
భావాతిభవ్యశుభధీవాదిరాజయతిభూవాగ్విలాసనిలయమ్ ।
శ్రీవాగధీశముఖదేవాభినమ్యహరిసేవార్చనేషు పఠతా-
మావాస ఏవ భవితాఽవాగ్భవేతరసురావాసలోకనికరే ॥**

34

**అవతారిక :** దశావతారస్తుతి ఫలశ్రుతి.

**అన్వయక్రమం :** భావ + అతిభవ్య – శుభ – ధీ – వాదిరాజ – యతి – భూ – వాగ్(క్) – విలాస – నిలయం గ్రీవా + ఆస్య – వాహ – తను – దేవ + అండజ + ఆది – దశ – భావ + అభిరామ – చరితం శ్రీ–వాక్ – అధీశ – ముఖ – దేవ + అభినమ్య – హరి – సేవా + అర్చనేషు పఠతామ్ అవాగ్ (క్) – భవ + ఇతర – సుర + ఆవాస – లోక – నికరే ఏవ ఆవాసః భవితా.

**ప్రతిపదార్థం :** భావాతి... నిలయమ్ : భావ = తలపులతో, అతిభవ్య = పరమ పవిత్రమై, శుభ = కళ్యాణహేతువయిన, ధీ = బుద్ధిగల, వాదిరాజయతి = వాదిరాజయతి ద్వారా, భూ = వెలువడిన (పుట్టిన), వాక్ = మాటలయొక్క, విలాస = సొబగులకు, నిలయమ్ = ఆకరమైన; గ్రీవా... చరితమ్ : గ్రీవా = కంఠమూ, ఆస్య = వదనమూ, వాహ = అశ్వంగాగల (హయగ్రీవ, హయవదనుడైన), దేవ = నారాయణునియొక్క, అండజ + ఆది = మత్స్యమూ మొదలుగాగల, దశ–భావ = దశావతారాలచే, అభిరామ = మనోహరమైన, చరితమ్ = చరిత్రను; శ్రీ... నేషు : శ్రీ = సంపన్నమైన, వాక్(గ్) + అధీశముఖ = బ్రహ్మ మొదలుగాగల, దేవ = దేవతలచే, అభినమ్య = నమస్కరింపదగిన, హరి = విష్ణువుయొక్క, సేవా = సేవయందు, అర్చనేషు = (వివిధ) పూజలయందూ; పఠతామ్ = బిగ్గరగా చదివేవారికి; అవాగ్... నికరే : అవాక్(గ్) – భవ + ఇతర = దక్షిణాధిపతికన్న (యమునికన్న) భిన్నమైన, సుర = దేవతలకు, ఆవాస = నివాసమైన, లోక = భువనాలయొక్క, నికరే = సమూహమందు; ఏవ = మాత్రమే (లోకాలయందే అని భావం); ఆవాసః = నివాసం (తనుత్యాగానంతరం); భవితా = కలుగుగాక (భూధాతువుపై లోట్ ప్రథమపురుషైకవచనం).

**తాత్పర్యం :** అతిపవిత్రమైన భక్తిభావనతోడనూ, నిర్మలబుద్ధితోడనూ వాదిరాజయతియొక్క వచోవిలాసాలకు నిలయమైనది ఈ మత్స్యాది దశావతారస్తుతి. బ్రహ్మాదిదేవతలు కూడా నమస్కరింపదగిన హరి సేవలలో, అర్చనలలో దీనిని పఠించిన వారికి యముడు తప్ప మిగిలిన దేవతల నివాసలోకాలలోనే నివాసం (మరణానంతరం) కలుగుగాక.

ఇతి శ్రీమద్వాదిరాజపూజ్యచరణవిరచిత దశావతారస్తుతిః సంపూర్ణమ్.

ఇక్కడితో సూరం శ్రీనివాసులు వ్రాసిన వ్యాఖ్య కూడా ముగిసినది.

శ్రీః